# LIKE TO FLY INTO THE EXCITING WORLD OF ADVENTURE AND HUMOUR?



**DOLTON**

**SUPER COMICS CAN TAKE YOU THERE EVERY FORTNIGHT!**

IT COSTS ONLY Rs. 2.50 A COPY- EVIDENTLY THE MOST EASILY AVAILABLE COMICS MAGAZINE YOU'VE EVER READ:

ITS 36 FULL COLOUR PAGES TAKE YOU THROUGH MYSTERY AND EXCITEMENT TO A RENDEZVOUS WITH THE SUPER HEROES-

SUPERMAN



BATMAN




**DOLTON PUBLICATIONS**
MADRAS 600 026

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''కీర్తిసేనుడి నిర్ణయం''] కు ఆధారం ఎం. లక్ష్మీగాయత్రి రచన.

ప్రజలపై అధికారం చలాయించేవాళ్ళు, దాన్ని మేలు-కీడులు రెంటిలో దేనికైనా ఉపయోగించ వచ్చు. అయినా, అధికారాన్ని వాళ్ళు ప్రజల మేలుకు ఉపయోగించినప్పుడు, ప్రజలు అలాంటి వాళ్ళపట్ల ఎంత భక్తిగౌరవాలు కనబరుస్తారో, ''అధికారం'' అన్న కథలో చక్కగా వివరించబడింది.

## అమరవాణి

విద్యా న శోభతే పుంసో, యది న స్యాత్ రసజ్ఞతా,
లవణేన వినా శాకాః, సుపక్వా అపి నిష్ఫలాః.

[కూరలను ఎంత చక్కగా వండినా, ఉప్పు వెయ్యకపోతే, అవి నిరుపయోగం. అదేవిధంగా రసజ్ఞత లేని విద్య కూడా నిరుపయోగమే!]

సంపుటి 74 ఏప్రిల్ '84 సంచిక 4

విడి ప్రతి : 2-00 : : సంవత్సర చందా : 24-00



## చందమామ కబుర్లు

### దూరమవుతున్న చందమామ



భూమి నుంచి చందమామ క్రమక్రమంగా దూరమవుతూ శతాబ్దానికి శతాబ్దం, చిన్నదిగా కనిపిస్తున్నది. చందమామ ఇలా దూరం కావడం వల్ల, మునుముందు సంపూర్ణసూర్యగ్రహణం ఏర్పడడం సాధ్య పడదు. అయినా అలా జరగడానికి ఇంకా ఎన్నో లక్షల సంవత్సరాలు పడుతుంది !

### కుండలో ప్రయాణం

స్పెయిన్ దేశానికి చెందిన ఇద్దరు యువకులు, ఇటీవల వంటచేసే ఒక పెద్ద కుండను సంపాదించి, అందులో కూర్చుని — ఈబ్రోనదిపై రెండువందలా ముప్పై కిలోమీటర్ల దూరం సరదాగా ప్రయాణం చేశారు !





### నెపోలియన్ నౌకలు

1798 వ సంవత్సరంలో జరిగిన నైలునదీ యుద్ధంలో, బ్రిటిష్ నౌకాదళ నాయకుడు అడ్మిరల్ నెల్సన్ — ఫ్రెంచి చక్రవర్తి నెపోలియన్ బోనపార్టీకి చెందిన నాలుగు నౌకలను ముంచివేశాడు. ఆ నాలుగు నౌకలూ ఇంకా అలెగ్జాండ్రియాతీరానికి 8 కి॥ మీ॥ దూరంలో నీటి అడుగున చెక్కుచెదరకుండా ఉన్నట్టు కనుగొనబడ్డాయి. వాటిని బయటికి తీసే పనులు ఇటీవలే ప్రారంభమయ్యాయి !

## మీకు తెలుసా?

1. సాహిత్యానికిగాను ప్రప్రథమంగా నోబెల్ బహుమతి పొందిన వారెవరు ?
2. మొట్టమొదట శాంతి కోసం నోబెల్ బహుమతి పొందిన వారెవరో మీకు తెలుసా ?
3. భౌతికశాస్త్రంలో తొలిసారిగా నోబెల్ బహుమతి గ్రహించిం దెవరు ?
4. రసాయనికశాస్త్రంలో మొట్టమొదటి నోబెల్ బహుమతి గ్రహీత ఎవరు ?
5. వైద్యశాస్త్రంలో మొట్టమొదట నోబెల్ బహుమతి సాధించిన వారెవరు ?

(సమాధానాలు 64వ పేజీలో)



# వికలాంగులు

సుదీపుడు పసివాడుగా వుండగానే, వాడి అందం చూసి ప్రతి ఒక్కరూ ఎంతో ముచ్చట పడేవాళ్ళు. వాడు పెరిగి పెద్ద వాడవుతున్నకొద్దీ, మరింత అందగాడుగా తయారుకాసాగాడు. నలుగురూ వాడి అందాన్ని మెచ్చుకుంటూండడంతో, వాడి కెంతో గర్వంగా వుండేది. వాడున్న ఊళ్లో ఒక మెల్లకంటి అమ్మాయీ, వంకర ముక్కు అబ్బాయీ, సొట్టచేతుల బిచ్చ గాడూ, కుంటి తాతా వుండేవాళ్ళు. ఈ విక లాంగులందర్నీ సుదీపుడు ఏవో సూటీ పోటీ మాటలతో, రోజూ అవహేళన చేస్తూండేవాడు.

సుదీపుడి తల్లి, కొడుకు దురుసు తనానికి బాధపడి, ఎన్నో నీతులు చెబు తూండేది. "నాయనా, ఏ మనిషయినా వికలాంగుడైతే, అతడికి మనం సాయ పడాలి గాని; హేళన చేయకూడదు. అలా చేయడం పాపం!" అనేది. కాని, సుదీపుడికి ఆ మాటలు ఏమాత్రం చెవికెక్కేవి కావు.

ఒకరోజున సుదీపుడు, ఆ నలుగురు వికలాంగుల్నీ ఎంతగా అవహేళన చేశా డంటే, వాళ్ళు నలుగురూ కోపం పట్టలేక ఒకటై, అతణ్ణి కొట్టడానికి వచ్చారు. సుదీపుడు వాళ్ళకు అందినట్టే అంది, దొరక్కుండా తప్పించుకు పారిపోయాడు.

అతడలా పారిపోతూంటే, విక లాంగులు నలుగురూ ఏక కంఠంగా, "మేము నీకేం అన్యాయం చేశాం? ఉత్తపుణ్యానికి మమ్మల్ని ఏడ్పిస్తున్నావు. నీకు, మా ఉసురు తప్పక తగుల్తుంది. ఏదో ఒకరోజున యింతకింతా అనుభవి స్తావు!" అన్నారు.

వాళ్ళ శాపనార్థాలు విని, ఆ క్షణాన సుదీపుడు నవ్వుకున్నా, మనసులో ఏదో

"వసుంధర"



తీసుకుపోయి, ఆమె తల్లిదండ్రుల యింట దిగవిడిచి, పట్నం తిరిగి వచ్చాడు.

ఆ రాత్రి సుదీపుడికి ఎంతకూ నిద్ర రాలేదు. అతడు పుట్టి పెరిగిన ఊరిలోని విశేషాలు గుర్తుకు రాసాగినై. తాను పని గట్టుకుని హేళనచేసి అవమానించిన కుంటితాతతో పాటు, మిగిలిన ముగ్గురు వికలాంగులూ, పట్టరాని కోపంతో పెట్టిన శాపనార్థాలు మనసులో మెదలగానే, అతడు చెప్పరాని భయంతో వణికి పోయాడు. కొంతసేపటికి కలతనిద్రలోకి జారుకున్నాడు.

మూల కాస్తంత భయం పాదు చేసు కున్నది. ఆ తర్వాత కొద్దిరోజులకు, అతడి తండ్రి ఊరు వదిలి పట్నం చేరుకున్నాడు. క్రమంగా సుదీపుడు పెరిగి పెద్దవా డయ్యాడు. యుక్తవయసు వచ్చాక తండ్రి అతడికి ఒక చక్కని అమ్మాయితో వివాహం చేశాడు.

కొంతకాలం గడిచింది. సుదీపుడి తల్లి దండ్రులు చనిపోయారు. అతడి తండ్రి పట్నంలో వ్యాపారం చేసి చాలా ధనం గడించాడు.

సుదీపుడు భార్యను ఎంతో ప్రేమగా చూసుకునేవాడు. ఆమె గర్భవతి అయి, నవమాసాలు నిండుతూండగా స్వయంగా

అతడి భార్య ఒక మగబిడ్డను కన్నది. ఆ బిడ్డకు సొట్టచేతులూ, కుంటికాళ్ళూ, వంకర ముక్కూ, మెల్లకన్నూ వున్నవి. ఆ బిడ్డను చూస్తూనే సుదీపుడు నిశ్చేష్టుడై పోయాడు.

సుదీపుడి భార్య మాత్రం ఏమీ బాధ పడకుండా, "చూడండి, మన బాబు ఎంత ముద్దువస్తున్నాడో!" అన్నది.

కాకిపిల్ల కాకికి ముద్దు! కన్నతల్లికి తన బిడ్డ ఎలా వున్నప్పటికీ ముద్దు వస్తాడు. ఇది గ్రహించిన సుదీపుడు, భార్యతో, "అవును, ఎంత ముద్దుగా వున్నాడు!" అనేశాడు.

ఆనాటి నుంచీ సుదీపుడు ఒక విచిత్రం గమనించాడు. భార్యకానీ, చూసినవాళ్ళు

కానీ బిడ్డ వికలాంగుడని అనేవారుకారు. ఊరికే వాడి అందచందాలను పొగడే వారు. కన్నతల్లి మమకారంతో భార్యా, తను బాగా ఆస్తిపరుడు కావడంవల్ల మిగతా బంధువులూ, తన కొడుకును హేళన చేయడం లేదని, అతడు అనుకున్నాడు.

కొడుకు పెరిగి పెద్దవాడవుతున్నకొద్దీ, సుదీపుడిలో దిగులు పెరిగిపోసాగింది. తన కొడుకు వికలాంగుడన్న మాట నిజం. అందువల్ల, నలుగురిలోకి అతడు వెళితే హేళనపాలవుతాడు. కనక, వాడు తల్లి దగ్గరైనా వుండాలి, లేదా తన దగ్గరైనా వుండాలి. వాడు ఎవరితోనన్నా ఆడుకునేప్పుడు పక్కన తనుగాని, తల్లిగాని వుండి తీరాలి. తల్లిదండ్రుల ఎదుట వున్నప్పుడు, తన కొడుకును ఎవరూ ఏమీ అనరు!

సుదీపుడు, కొడుకును యిలాంటి కట్టుదిట్టాలతో పెంచసాగాడు. చిన్నతనంలో తాను వికలాంగుల్ని హేళన చేసినప్పుడు వాళ్ళెంత బాధపడి వుంటారో యిప్పుడు, అతడికి అర్థమయింది. వాళ్ళ శాపాల ఫలితంగానే కొడుకు, యిలా అయ్యాడని సుదీపుడు నమ్మాడు.

ఇలా వుండగా, అతడి ఇంటికి దగ్గర్లో వున్న ఒక సత్రంలో సన్యాసి ఒకడు దిగాడు. ఆయనకు ఎన్నో అద్భుత శక్తు



లున్నాయని అందరూ చెప్పుకోసాగారు. సుదీపుడు, సన్యాసిని తన ఇంటికి ఆహ్వానించి కొడుకును చూపించాడు.

"దీపంలాంటి కొడుకు. నువు చాలా అదృష్టవంతుడివి, నాయనా!" అన్నాడు సన్యాసి.

సుదీపుడు కొడుకును లోపలకు పంపి, సన్యాసికి తన బాధ చెప్పుకున్నాడు. అతడు చెప్పింది వింటూనే సన్యాసి ముఖం గంభీరంగా అయిపోయింది. ఆయన తీవ్రంగా ఆలోచించి, "నువ్వు, వెంటనే మీ ఊరు వెళ్ళి, లోగడ నువ్వు హేళన చేసిన వాళ్ళందరినీ క్షమాపణ కోరుకో. వాళ్ళల్లో కుంటితాత యిప్పుడు

జీవించిలేడు. ఆ ఊళ్ళోనే అతడి సమాధి వున్నది. ఆ సమాధి ముందు నిలబడి, నీ క్షమాపణలు చెప్పుకో! నీ కొడుకు వికార లక్షణాలు పోయి, నీకు శుభం కలుగుతుంది,'' అని చెప్పాడు.

వెంటనే సుదీపుడు ప్రయాణమై, తన ఊరు వెళ్ళాడు. అక్కడ మెల్లకంటి అమ్మాయినీ, వంకరముక్కు అబ్బాయినీ, సొట్టచేతుల బిచ్చగాణ్ణీ కలుసుకుని క్షమాపణ అడిగాడు.

వాళ్ళు ఎంతో మర్యాదగా, ''పగ వాళ్ళకు కూడా, మా లాంటి అనాకారి రూపాలను కోరం. నీ బిడ్డకున్న అవలక్షణాలు, మేం క్షమిస్తే పోతాయంటే, మేము తప్పక నిన్ను క్షమిస్తాం,'' అన్నారు.

వాళ్ళ మంచితనానికి చాలా సంతోషించి, సుదీపుడు వాళ్ళకు తలా ఒక పది బంగారు కాసులూ యిచ్చి కుంటి తాత సమాధి దగ్గిరకు వెళ్ళాడు.

సుదీపుడు సమాధికి చేతులు జోడించి, ''తాతా, నువ్వు కుంటివాడివని ఎగతాళి చేశాను. నా దుర్బుద్ధిని క్షమించి, నా బిడ్డను దీవించు!'' అన్నాడు కళ్ళ నీళ్ళతో.

ఆ మరుక్షణం సుదీపుడికి మెలుకువ వచ్చింది. కలలో అయితేనేం, తాను అవమానించిన వాళ్ళనుంచి క్షమాభిక్ష దొరికినందుకు, అతడు చాలా ఆనంద పడ్డాడు.

ఆ తర్వాత వారం రోజులకు అత్తవారింటి నుంచి సుదీపుడికి కబురు వచ్చింది. భార్య ప్రసవించిందనీ, చక్కటి మగ పిల్లవాడనీ.

సుదీపుడు అప్పటికప్పుడే బయలుదేరి, అత్తవారి ఊరు వెళ్ళి, ముద్దులు మూటగట్టే పసికందును చూసుకుని, ఎంతో మురిసిపోయి భార్యతో, ''చిన్నతనంలో, నా నుంచి అవమానాల పాలయిన వికలాంగులు నలుగురూ నన్ను క్షమించి దీవించారు. అందుకే మన బాబు యింత అందంగా వున్నాడు,'' అన్నాడు సంతోషంగా.






## 12

[అన్నలు కోరగా పింగళుడు ఓడనరంగుకు తన ఇంటిలో ఆతిథ్యం యివ్వటానికి అంగీకరించాడు. ముందు అనుకున్న ప్రకారం, ఓడనరంగు తన అనుచరుల సాయంతో పింగళుణ్ణి బంధించి తన ఓడ మీదికి తీసుకుపోయాడు. అన్నలిద్దరూ ఇంటికి వచ్చి, తల్లిని కొట్టి పింగళుడు తెచ్చిన ధనాన్నీ, మహత్తుగల సంచీనీ చేజిక్కించుకున్నారు. తరవాత—]

జీవదత్తుడూ, లక్షదత్తుడూ కలిసి ఎంతో ఆత్రంగా పింగళుడు తెచ్చిన ధనపుసంచీ మూతి విప్పి, అందులో గల బంగారాన్నీ, వెల లేని మణిముత్యాలనూ చూసి మూర్ఛపోయినంత పని చేశారు. పింగళుడు ఏదో కొంత ధనం సంపాయించుకు వచ్చాడని తప్ప, యింత పెద్ద మొత్తం తెచ్చాడని మాత్రం వాళ్ళు కలలో కూడా అనుకోలేదు.

"ఈ దెబ్బతో మన దరిద్రమే కాక, అటూ యిటూ ఏడు తరాల దరిద్రం కూడా తీరిపోతుంది," అన్నాడు జీవదత్తుడు.

"అవున్రా అన్నా, అవును! మన దగ్గిర యింత డబ్బు వున్నదని తెలిస్తే, యీ అవంతీ నగరపు రాజుగారే మనకు పిల్లల్ని యిచ్చేందుకు మంత్రితో సహా బయలుదేరి మన యింటికి వస్తాడు," అన్నాడు లక్షదత్తుడు ఉత్సాహంగా.



కొడుకు లిద్దరూ యీ విధంగా మాట్లాడుకోవటం విన్న తల్లికి, వాళ్ళ మీద ఎక్కడలేని వాత్సల్యమూ పుట్టుకొచ్చింది. ఆ నిమిషం వరకూ వాళ్ళిద్దరూ తనను తిట్టి కొట్టిన సంగతి మరిచిపోయి ఆమె, "అయితే నాయనలారా, మీ రిద్దరూ ఒక పని చెయ్యండి. పూర్వం లాగా వున్న డబ్బంతా దుర్వ్యసనాలకు ఖర్చుపెట్టక, హాయిగా పెళ్ళాడి ఒక యింటివాళ్ళుకండి! నేను మీ పంచనే వుండి కాలం వెళ్ళబుచ్చుతాను," అన్నది.

తల్లి యిలా అనేసరికి కొడుకు లిద్దరూ పాముల్లాగా బుసలుకొట్టి చర్రుమంటూ లేచారు. "మేం కావాలంటే పెళ్ళిళ్ళు చేసుకుంటాం, లేకపోతే బైరాగుల్లా తిరుగుతాం, ఆ సంగతి నీ కెందుకు? నీకు మా మీద ఏమాత్రం పుత్రప్రేమ లేదని మాకు తెలుసు. నీకు సర్వం ఆ పింగళుడే! కల్లబొల్లి మాటల్తో మమ్మల్ని మోసగించి, యీ మా తండ్రి ఆస్తిలో పాలు పంచుకోవాలని చూస్తున్నావు, అవునా?" అన్నారు.

"అది మీ తండ్రి గడించిన ఆస్తి కాదు. పింగళుడి కష్టార్జితం. దాన్ని ఎలాగూ మీరు పంచుకోబోతున్నారు గనక నేనేమీ చేయగలిగింది లేదు. నేను కోరేదల్లా ఆ మహత్తు గల సంచీ నా కివ్వమని. అది నా దగ్గిర వుంటే మీకు కావలసినప్పుడల్లా, ఇంటికి వచ్చి, యిష్టమొచ్చిన విందు భోజనం చేసి వెళ్ళవచ్చు. నేనూ లోగడలాగా కూటికి వాచి అక్కడా యిక్కడా బిచ్చమెత్తవలసిన అవసరం కలగదు," అన్నది తల్లి.

"నువ్వు ముమ్మాటికీ నా తల్లివి కాదు. అలాటప్పుడు నువ్వు బిచ్చమెత్తితే నాకేం!" అన్నాడు జీవదత్తుడు యీసడింపుగా.

"అంతేరా అన్నా, అంతే! మన అయ్య ఆస్తిని దాచి చిన్నకొడుక్కి మూటకట్టి ఒప్పచెప్పాలని చూస్తున్న మనిషి మనకు తల్లి ఎలా అవుతుంది?" అన్నాడు లక్షదత్తుడు.

ఇక వాళ్ళతో వాదించి లాభం లేదని తల్లి నిస్పృహ చెంది, గోడకు చేరగిల బడింది. జీవదత్తుడూ, లక్షదత్తుడూ కలిసి పింగళుడు తెచ్చిన ధనాన్ని భాగాలు వేసుకున్నారు. పని ముగిసిం తరవాత మహత్తుగల సంచీని గురించి వాదన ప్రారంభమయింది.




అన్నదమ్ము లిద్దరూ కూడా ఆ సంచీ నాకు కావాలంటే నాకు కావాలని పోట్లాటకు ఉపక్రమించారు. అది క్రమంగా ముదిరి హద్దులు దాటి ఒకరి గొంతు ఒకరు పట్టుకునే దశకు వచ్చింది. తల్లి వారిద్దరినీ సమీపించి బతిమాలుతూ, ''నాయనలారా, మీరు పోట్లాడుకుని ఒకళ్ల కొకళ్ళు హాని కలిగించుకోకండి. మీరు నన్ను ఎంత యీసడించినా, మీరు నా పుత్రులన్న సంగతి నేనెలా మరిచి పోగలను? సావధానపడి ఆ సంచీ నా దగ్గిర వుంచండి, మీరు దెబ్బలాడుకో వలసిన అవసరం కలగదు,'' అన్నది.

''సంచీలో నా వంతు నేను పుచ్చు కుంటాను,'' అంటూ జీవదత్తుడు వంట గదిలోకి పరిగెత్తి కత్తిపీట తీసుకువచ్చి, సంచీని అడ్డంగా కోయబోయాడు. కాని తల్లి అతడికి అడ్డుపడి, ''నాయనా, జీవ దత్తా! ఆ పని చేయకు. ఒకసారి దాన్ని ముక్కలు చేశావో, దాని మహత్తంతా పోతుంది. దాన్ని ఎవరో ఒకరు మొత్తంగా వాడుకోవలసిందేగాని, ముక్కలు చేసి లాభం లేదు,'' అన్నది.

''అయితే, ఆ సంచీ నాకే కావాలి!'' అన్నాడు లక్షదత్తుడు.

''ఛీ వెధవా! నేను యింటికి పెద్ద వాణ్ణి, జ్యేష్ఠపుత్రుణ్ణి. యిలాటి మహత్తు గల వస్తువులన్నీ అలాంటివాడికే చెందుతవని శాస్త్రాలూ, పురాణాలూ కూడా ఘోష పెడుతున్నవి,'' అన్నాడు జీవదత్తుడు.

ఈ విధంగా యింట్లో అన్నదమ్ముల మధ్య జరుగుతున్న కలహాన్ని, ఆ రాత్రి పట్టణంలో గస్తీ తిరుగుతున్న అవంతీ నగర కొత్వాలు ఒకడు విన్నాడు. అతడికి



ధనం సంగతీ, మహత్తుగల సంచీ సంగతీ తెలిసిపోయింది. అతడు సూర్యోదయం వేళకే రాజుగారి దగ్గిరకు వెళ్ళి, తను విన్న సంగతి యావత్తూ నివేదించాడు.

అసలే ఆ అవంతీనగర రాజు పరమ పిసినిగొట్టు. అలాంటివాడికి యీ రహస్యం చెవులబడేసరికి ఎక్కడ లేని దురాశా పుట్టుకొచ్చింది. ఆయన వెంటనే తన దండనాయకుణ్ణి పిలిపించి, ఆ అన్న దమ్ములనూ, ఆ యింట్లో వున్న అన్ని వస్తువులనూ తన ఆస్థానానికి పట్టించుకు రావలసిందిగా ఆజ్ఞాపించాడు.

దండనాయకుడు భటులను వెంట వేసుకు వెళ్ళి, జీవదత్తుణ్ణీ, లక్షదత్తుణ్ణీ చేజిక్కించుకున్నాడు. తరవాత యిల్లంతా గాలించి ధనాన్నీ, మహత్తుగల సంచీనీ దొరకపుచ్చుకోవటమే గాక, యింట్లో వున్న సామాను కూడా వశపరుచుకుని, బళ్ళ మీద రాజాస్థానానికి చేరవేశాడు.

జీవదత్తుడూ, లక్షదత్తుడూ కూడా రాజుతో జరిగిన సంగతేమిటో చెప్పటానికి నిరాకరించారు. కాని, రాజు భటులచేత నాలుగైదు కొరడాదెబ్బలు కొట్టించేసరికి, వాళ్ళిద్దరూ మొదటి నుంచీ జరిగిన కథ యావత్తూ ఆయనకు వినిపించారు.

"అయితే, యీ ఆస్తి మీది కాదన్న మాట!" అంటూ రాజు సంతోషంగా నవ్వి, "రాజ్యంలో హక్కుదారులంటూ లేకుండా వున్న ఆస్తి యావత్తూ న్యాయ శాస్త్రరీత్యా నాకే చెందుతుంది. మీరు మీ తమ్ముడని చెప్పబడే ఆ పింగళుణ్ణి బానిసగా అమ్మేశారు. కనుక, అతడికి ఆస్తి హక్కులుగానీ, పౌరహక్కులుగానీ, ఏమీ వుండవు. ఇక మీ యిద్దరి సంగతి: మీరు మీదికాని ఆస్తిని రహస్యంగా పంచుకునేందుకు ప్రయత్నించినందుకుగాను, ఇరవై ఏళ్ళు కారాగారశిక్ష విధిస్తున్నాను," అన్నాడు.

"మహారాజా! మమ్మల్ని కరుణించి విడిచిపుచ్చండి. ఆ ధనంగాని, మహత్తు గల సంచీగాని మాకు అవసరం లేదు.

స్వేచ్ఛగా బతికేందుకు అనుజ్ఞయివ్వండి." అన్నారు జీవదత్తుడూ, లక్షదత్తుడూ.

కాని రాజుకు వాళ్ళను స్వేచ్ఛగా వదలటం యిష్టం లేదు. అలా వదిలితే వాళ్ళు ప్రజల మధ్యకు వెళ్ళి, తను చేసిన అన్యాయం సంగతి ఏక్కరువుపెడతారు. అప్పుడు ప్రజల్లో కొందరికైనా తన మీద అసంతృప్తి కలగవచ్చు.



"మీకై మీరు చేసిన నేరాన్ని ఒప్పుకోవటమే గాక, కన్నతల్లిని హింసించిన సంగతి కూడా యథార్థం అని అంగీకరిస్తున్నారు గనక, మీకు కారాగారశిక్ష తప్పదు. పోతే, మీ తల్లికి జీవితకాలం వరకూ నెలకు పది మొహరీలు భరణం యిస్తున్నాను," అంటూ రాజు తీర్పు చెప్పి, తన ఉద్యానవనం కేసి వెళ్ళిపోయాడు.

రాజభటులు జీవదత్తుడికీ, లక్షదత్తుడికీ కాళ్ళకు యినప గొలుసులు తగిలించి, వాటికి పెద్ద యినపగుండు తాపడం చేసి, చీకటి కోణంగా వున్న ఒకానొక కారాగారపు గదిలోకి వాళ్ళను యీడ్చుకుపోయి వదిలి, బయట తలుపులకు తాళం బిగించారు.

అన్నదమ్ము లిద్దరూ తమకు పట్టిన దుర్గతికి ఎంతో వాపోయారు. ఆ నిమిషంలో వాళ్ళకు తమ్ముడికీ, కన్నతల్లికీ కూడా తీరని ద్రోహం చేశామన్న పశ్చాత్తాపం కలిగింది. అయినా, అంతా మించిపోయిం తరవాత యిప్పుడు తాము చేయగలిగిందేమీలేదు. చీకటీ, దుర్గంధం, తడీ పొడీగా వున్న నేలా, నీళ్ళోడుతున్న గోడలూ—అలాంటి నరక కూపంలో వాళ్ళిద్దరూ ఎంతోసేపు దుఃఖించి, చివరకు సొమ్మసిల్లి నిద్రపోయారు.

అన్నలిద్దరూ కలిసి చేసిన ద్రోహం ఫలితంగా పింగళుడు ఓడసరంగుకు బానిసగా దొరికిపోయాడు గదా? ఇక ఆ సరంగు పింగళుణ్ణి తన ఓడలోని మిగతా బానిసలతోపాటు తెడ్లువేసే చోటున వున్న యినప కమ్మీకి గొలుసులతో బంధిం

చాడు. తెల్లవారుతూనే ఓడ లంగరు ఎత్తబడింది. సరంగు ఆజ్ఞ కాగానే దాన్ని బానిసలు తెడ్లు వేసి సముద్రం లోపలికి మళ్ళించారు.

ఈ సరంగు పైకి మామూలు పెద్ద మనిషి లాగా కనిపించినా, నిజానికి పేరు మోసిన ఓడదొంగ. వ్యాపార వస్తువులను ఒక రేవునుంచి మరో రేవుకు తీసుకు వెళ్ళే మిషతో, అతడు ఎక్కడ ఏ రేవులో ఎలాంటి సరుకు ఓడలకు ఎత్తబడు తున్నదీ పసికట్టి—ఆ ఓడలను మహా సముద్రాల మీద అటకాయించి దోచు కుంటూ వుండేవాడు. అలా దోచుకున్న ఓడలలోని వారినందరినీ అతి క్రూరంగా సముద్రంపాలు చేస్తూండేవాడు. ఒకవేళ వారిలో ఎవరినైనా ప్రాణాలతో వదిలితే, వారు తన నిజస్వరూపం నలుగురితోనూ చెపుతారని అతడి భయం.

బానిసలతోపాటు తెడ్డు వేస్తున్న పింగ ళుడు తను మరిచిపోయిన భల్లూకకేతుడి మంత్రం గుర్తు చేసుకునేందుకు ఎంతగానో ప్రయత్నించాడు. కాని అతడికి ఎంత బుర్ర బద్దలుకొట్టుకున్నా అది గుర్తుకు రాలేదు. తన అన్నలు తన ఆస్తికోసం తనను యింత కుటిలంగా ఓడసరంగుకు బానిసగా అమ్మారని తెలుసుకుని పింగ ళుడు మండిపోయాడు. ఇక యిప్పుడు తన అడ్డు లేదు కనక తల్లిని వాళ్ళు పూర్వం లాగే నానా హింసలూ పెడతారనీ, తను సంపాయించుకు వచ్చిన ధనాన్ని



దుబారా ఖర్చులకు వినియోగిస్తారనీ అతడు గ్రహించాడు.

ఈ బానిస జీవితాన్నుంచి తను బయట పడటం ఎలా? పింగళుడికి రేబవళ్ళు యిదే ఆలోచన. అనుకోని విధంగా—దైవసంకల్పమా అన్నట్టు ఒకానొక రోజున సముద్రం మీద పెనుతుఫాను ప్రారంభ మయింది. సముద్రంలో ఉవ్వెత్తుగా లేచిన అలలకూ, పెనుగాలి తాకిడికీ ఓడ సుడిగాలిలో ఎండుటాకులా అల్లల్లాడ సాగింది. సరంగు ప్రమాదం గుర్తించి తన అనుచరులకూ, బానిసలకూ హెచ్చరికలూ, ఆజ్ఞలూ యిస్తూ ఓడంతా కలయ తిరుగుతున్నాడు. అదే సమయంలో అతడి పాలిటి మిత్తి పంపినదా అన్నట్టు, దూరంలో మరొక ఓడ తుఫానులో చిక్కి, సముద్రపు అలల మీద అటూ యిటూ దొర్లుతూ కనిపించింది.

సరంగు తనవద్ద గల దుర్భిణీలోంచి ఆ ఓడను పరీక్షించి చూశాడు. అది చాలా పెద్ద ఓడ. ఖండాంతర వ్యాపారాలకు గాను, పెద్ద పెద్ద వర్తకులు ఉపయోగించే కోవకు చెందింది. అలాంటి ఓడలో వెల లేని వర్తక సరుకులు వుంటవని సరంగుకు తెలుసు.

సముద్రం మధ్యన రెండు ఓడలు పెనుతుఫానులో చిక్కి ప్రమాదావస్థలో వున్నవి. నావికులు ఓడలను రక్షించుకునేందుకు తమ యావచ్ఛక్తినీ వినియోగిస్తున్నారు. ఇలాంటి అదనులో తను



కొంత సాహసించి, ఆ ఓడను ముట్టడిస్తే, తప్పక అందులో గల అమూల్యమైన వర్తక సామానులన్నీ తనవి అవుతవని సరంగుకు దురాశ కలిగింది. తన అనుచరులా: యిలాంటి గడ్డు పరిస్థితులకు అలవాటు పడినవాళ్ళు. ఇక ఆ వర్తక ఓడలో వున్న నావికులు సముద్రయానానికి అవసరం అయిన నావికా పరిజ్ఞానం వున్నవారే తప్ప, సముద్ర యుద్ధానికి అలవాటు పడినవాళ్ళయి వుండరు.

సరంగు యీ విధంగా ఆలోచించి, తన అనుచరులను హెచ్చరించాడు. అంత తుఫానులోనూ అతడి అనుచరులు కత్తులూ, విల్లమ్ములూ ధరించి ఆ వర్తక ఓడను వశపరుచుకునేందుకు సన్నద్ధమయారు.

పింగళుడు, మిగతా బానిసలతోపాటు వున్న శక్తినంతా వినియోగించి తెడ్డు వేస్తున్నాడు. క్రమంగా ఓడ ఆ వర్తకపు ఓడను సమీపిస్తోంది. సరంగు తన ముఖ్యానుచరులతో తెరచాప కొయ్యకు ఆనుకు నిలబడి, దుర్భిణిలోంచి వర్తకపు ఓడ కేసి చూస్తున్నాడు. హఠాత్తుగా అతడు భయకంపితమైన స్వరంతో అరిచాడు :

''అందరూ విల్లంబులు ఎక్కుపెట్టి వదలండి! ఓడను వెనక్కు నడపండి! అది వర్తకపు ఓడలా లేదు. వాళ్ళు మండుతున్న గుడ్డలను బాణాలకు చుట్టి మన ఓడ మీదికి వదలబోతున్నారు!''

సరంగు మాట ముగించీ ముగించక ముందే, అవతలి ఓడలోంచి మండుతూన్న బాణాలు తారాచువ్వల్లా వేగంగా ఎగిరి వచ్చి, పింగళుడున్న ఓడ మీద పడసాగినై. వాటిలో కొన్ని తెరచాపస్తంభానికి ఆనుకు నిలబడిన సరంగు అనుచరుల మీద పడి, వాళ్ళ దుస్తులు భగ్గుమని మండినై. వెంటనే సరంగు పిచ్చివాడిలా గంతులువేస్తూ, ''బానిసలందర్నీ వెంటనే వదలండి. వాళ్ళు తెడ్లు వదిలి, కత్తులు పట్టి ఓడను రక్షించవలసిన సమయం వచ్చింది.'' అంటూ భీకరంగా కేకలు పెట్టాడు. —(ఇంకావుంది)






# కీర్తిసేనుడి నిర్ణయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రివేళ భీతిగొలిపే యీ శ్మశానంలో నువ్వు పడుతున్న శ్రమ ఏనాటికైనా ఫలించే అవకాశం వుండవచ్చు; కాదనను. కాని, క్షాత్రధర్మాను సారం పరరాజ్యాలను జయించిన, మహా పరాక్రమవంతులైన రాజులే, అల్పమైన విమర్శలకూ, అభియోగాలకూ జంకి, చేజిక్కినదాన్ని వదిలి పలాయనం చేస్తారు. నువ్వు మాత్రం కార్యం సాధించిన తరవాత, అలా చెయ్యవన్న నమ్మకం ఏమిటి ? ఉదాహరణగా నీకు, కీర్తిసేనుడనే రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



ఉజ్వలదేశానికి చెందిన గిరిపురంలో మైథిలి, వాసంతిక అనే యిద్దరు అక్కచెల్లెళ్ళు వుండేవారు. చిన్నతనంలోనే తల్లిదండ్రులు గతించడంతో, వాళ్ళను అమ్మమ్మ పెంచి పెద్దచేసింది. ఆమె కూడా వృద్ధురాలయ్యాక కాలధర్మం చెందింది.

మైథిలి, వాసంతిక—ఇద్దరూ అందగత్తెలే. అయితే, మైథిలి విద్యావతి; వాసంతికకు చదువు అంతగా రాకపోయినా, మధురంగా పాడగలదు.

ఒకసారి వానలు లేక ఉజ్వలదేశంలో కరువుకాటకాలు సంభవించాయి. రాజు వినయవర్మ తనకు చేతనైనంతలో ప్రజలకు సాయపడేందుకు తగిన ఏర్పాట్లు చేయసాగాడు. కాని, పులి మీద పుట్రలా, ఉజ్వలదేశపు పరిస్థితులను అవకాశంగా తీసుకుని, పొరుగున వున్న వరాళిదేశపు రాజు కీర్తిసేనుడు దండెత్తివచ్చాడు. రాజు వినయవర్మ అతణ్ణి ఎదిరించి పోరాడి ఓడిపోయాడు. కీర్తిసేనుడు రాజధానిని ఆక్రమించి, రాజు వినయవర్మను ఖైదుచేశాడు.

దేశాన్ని జయించిన తరవాత కీర్తిసేనుడు అక్కడి కరువుకాటక పరిస్థితులు స్వయంగా చూసి చాలా బాధపడ్డాడు. ఇప్పుడు దేశానికి తను రాజు కనక, ప్రజలను యిక్కట్ల బారినుంచి కాపాడడం, తన బాధ్యతగా భావించాడు. ఆయన కొద్ది సైన్యాన్నీ, రాజోద్యోగులనూ వెంటబెట్టుకుని దేశంలోని అన్ని ప్రాంతాలూ సందర్శిస్తూ, ప్రజల అవసరాలు విచారించి తగుసహాయం చేయసాగాడు.

కీర్తిసేనుడు యిలా దేశపర్యటన చేస్తూ గిరిపురం వచ్చి వెళ్ళిన రోజునే, వాసంతిక కనబడకుండా పోయింది. శ్యామలాముఖి అనే నది గిరిపురాన్ని అనుకుని ప్రవహిస్తూంటుంది. ఇప్పుడానదిలో అంతగా నీరు లేదు. అలవాటు ప్రకారం వాసంతిక, ఆ నదికి నీటికోసం తెల్లవారుజామున వెళ్ళి తిరిగిరాలేదు.

మైధిలి చెల్లెల్ని వెదుక్కుంటూ నదికి వెళ్ళింది. అక్కడ వాసంతిక జాడలేదు గాని, నది ఒడ్డున ఆమె విడిచిపోయిన బిందె మాత్రం కనిపించింది. కొందరు ఆమె బిందె అక్కడ పెట్టి, నది ఎగువకు వెళ్ళడం చూశామనీ, ఆ సమయంలో కీర్తిసేనుడు సైనికులతో ఆ మార్గానే వెళుతున్నాడనీ, మైధిలికి చెప్పారు. అంతేకాక, అతడామెను అపహరించుకు పోయి వుంటాడన్న అనుమానం కూడా వెలిబుచ్చారు.



ఇది విని మైధిలి కలవరపడింది. ఆమె అప్పటికప్పుడే బయలుదేరి రాజధానికి వెళ్ళింది. ఆ సమయంలో కీర్తిసేనుడు సభతీరివున్నాడు. మైధిలి అతడి దర్శనం చేసుకున్నది.

కీర్తిసేనుడు ఆమె వచ్చిన పని తెలుసుకుని, "నీ చెల్లెలికోసం తప్పక వెతికిస్తాను. నీకెవరి మీదనైనా అనుమానం వున్నదా?" అని అడిగాడు.

మైధిలి క్షణం తటపటాయించి, "ఉన్నది, ప్రభూ!" అన్నది.

"ఎవరి మీద?" అని ప్రశ్నించాడు కీర్తిసేనుడు.

"అసహాయపరిస్థితుల్లో వున్న ఒక స్త్రీని చెరబట్టినవాడి మీద!" అన్నది మైధిలి గంభీరంగా.

ఆ జవాబుకు కీర్తిసేనుడు ఆశ్చర్యపోయి, "గూఢంగా మాట్లాడకు. సంగతేమిటో వివరంగా చెప్పు." అన్నాడు.

"అలాగే చెబుతాను, ప్రభూ! నేను దేనికైనా సిద్ధపడే వచ్చాను గనక, నన్ను కఠినంగా శిక్షిస్తారేమో అన్న భయం లేదు. నేను అనుమానిస్తున్నది, మిమ్మల్నే!" అన్నది మైధిలి.

కీర్తిసేనుడు ఒక క్షణకాలం నివ్వెరపోయి, "నేనా?" అంటూ గద్దించాడు.

మైధిలి చలించకుండా, "ప్రభూ, మీకు కోపం వస్తుందని, నాకు ముందే తెలుసు. కాని, యిది నా ఒక్కతె అనుమానమే కాదు; గిరిపుర వాసులందరి అనుమానం.

మీరు దీనస్థితిలో వున్న మా రాజ్యలక్ష్మిని చెరబట్టిన ధర్మదూరులు. అలాంటి మీరు వయసులో వున్న అందగత్తెను—అసహాయురాల్ని అపహరించ రన్న నమ్మకం ఏమిటి ? మీరు సైన్యంతో శ్యామలాముఖి నదీ ప్రాంతాన్నుంచి వెళుతున్నప్పుడే, నా చెల్లెలు మాయమైంది !'' అన్నది.

మైథిలి మాటల్లో సునిశితమైన విమర్శ వున్నది, తేలిగ్గా కాదనలేని అభియోగం వున్నది—అన్నిటినీ మించి పదునైన తర్కం వున్నది.

కీర్తిసేనుడు అంత సభామధ్యంలో వెంటనే జవాబు చెప్పలేక తల దించుకున్నాడు. సభికులకు ఆమె మాటల్లో నిజాయితీయే కాక, ఆమె పక్షాన న్యాయం వున్నదన్న భ్రాంతి కూడా కలగవచ్చు!

కొంచెం సేపు యిలా ఆలోచించి కీర్తిసేనుడు తల ఎత్తి, మైథిలితో, ''నీ చెల్లెల్ని నేను అపహరించలేదని దైవసాక్షిగా చెబుతున్నాను. ఆమెను వెతికిస్తాను. నన్ను నమ్మి వెళ్ళు !'' అన్నాడు.

మైథిలి తిరిగి గిరిపురానికి బయలుదేరింది. కీర్తిసేనుడికి ఆమె సాహసం, చొరవా బాగా నచ్చాయి. ఆమె అందం కూడా అతణ్ణి ఆకర్షించింది. వాసంతిక విషయం తేలిన తరవాత, ఆమెను వివాహమాడాలనుకున్నాడు.

మైథిలి ఇల్లు చేరేసరికి, వాసంతిక ఇంట్లోనే వున్నది. ఆమె లోగడ తనకు సంగీత కళాశాలలో సహాధ్యాయి అయిన



ఒక యువకుణ్ణి, దేవాలయంలో పెళ్ళాడి ఇంటికి తిరిగి వచ్చింది. ఈ సంగతి ముందుగా అక్కకు చెబితే, ఆమె అంగీకరించదన్న భయంతో, వాసంతిక యీ పని రహస్యంగా చేసింది.

నూతన దంపతులను దీవించి, మైథిలి తిరిగి రాజధానికి వెళ్ళి, తాను చేసిన పొరబాటుకు కీర్తిసేనుణ్ణి క్షమించవలసిందిగా కోరింది.

కీర్తిసేనుడు నవ్వి, ''ఇందులో క్షమించవలసిందేమీలేదు. నేను మీ దేశం వదిలి వెళ్ళిపోతున్నాను. మీ రాజుకు తిరిగి సింహాసనం అప్పజెబుతాను. మైథిలీ, నువ్వు అనుకోకుండానే నాకు గొప్ప ఉపకారం చేశావు. ఈ కానుకలు స్వీకరించు!" అని ఆమెకు విలువైన కానుకలు బహూకరించి, వరాళిదేశం వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, కీర్తిసేనుడి నిర్ణయం తాలూకు పూర్వాపరాలు తరచిచూస్తే, వింతగాలేవా ? తనను నిండు సభలో అవమానించిన మైథిలిని అతడు పెళ్ళాడాలనుకోవడం ఏమిటి ? అలా అనుకున్నవాడు తరవాత ఎందుకు మనసు మార్చుకున్నాడు ? అన్నిటికన్న విచిత్రం; తాను జయించిన ఉజ్వల దేశాన్ని వదులుకోవడం ! ఇది కేవలం అవివేకం కాక ఏమవుతుంది ? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగులుతుంది,'' అన్నాడు.



దానికి విక్రమార్కుడు, "కీర్తిసేనుడి నిర్ణయంలో వింతపడవలసిందేమీ లేదు. రాజంతటివాణ్ణి నిండుసభలో అనుమానిస్తూ మాట్లాడగలిగిన మైథిలి ధైర్యానికి ముగ్ధుడై, ఆమెను పెళ్ళాడదామనుకున్నాడు. కాని, తన నిర్ణయంలో నిలోపం, తరవాత అతడికి తెలిసివచ్చింది. వాసంతిక కనబడకుండా పోయిన విషయంలో, పూర్వాపరాలు ఏమీ ఆలోచించకుండా, రాజును నిస్సంకోచంగా అనుమానించింది, మైథిలి. సామాన్య స్త్రీకి అలాంటి తొందరపాటు వున్నా పర్వాలేదు; కాని రాణివాసపు స్త్రీకి అటువంటి తొందరపాటు ప్రమాదహేతువు. అందుకే కీర్తిసేనుడు, ఆమెను వివాహమాడాలనుకున్న నిర్ణయాన్ని మార్చుకున్నాడు.

ఇక, కీర్తిసేనుడు జయించిన రాజ్యాన్ని వదులుకోవడం గురించి: ఒక దేశపు రాజు దుర్మార్గుడైనపుడూ, బుద్ధిహీనుడయినపుడూ, శత్రురాజు ఆ రాజ్యాన్ని వశం చేసుకుని సక్రమంగా పాలిస్తే, ప్రజలు అతడిపట్ల భక్తి గౌరవాలు కనబరుస్తారు. కాని, కీర్తిసేనుడు ఖైదు చేసిన ఉజ్వలదేశపు రాజు దుర్మార్గుడూ కాదు, బుద్ధిహీనుడూ కాదు. తనకు చేతనైనంతలో, అతడు రాజ్యంలో చెలరేగిన కరువుకాటకాలను నివారించేందుకు కృషి చేస్తున్నాడు. అలాంటివాణ్ణి సింహాసనభ్రష్టుణ్ణి చేసిన పొరుగురాజు ఎన్నటికీ ప్రజల గౌరవాభిమానాలు సంపాయించుకోలేడు. ఈ విషయం కీర్తిసేనుడికి, మైథిలి తనను అవమానిస్తూ మాట్లాడడంతో చాలావరకు అర్థమైంది. అందువల్లనే అతడురాజ్యాన్ని తిరిగివినయవర్మకు అప్పగించాడు. ఇది వివేకంతో, రాజకీయ చతురతతో చేసిన నిర్ణయం. ఇందువల్ల, కీర్తిసేనుడి ప్రతిష్ఠ తన రాజ్యంలోనే కాక, పొరుగు రాజ్యాల్లో కూడా పెరిగే అవకాశం వున్నది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# రాజోద్యోగం

కనకగుప్తుడు మహేంద్రపురి రాజకోశాగారానికి అధిపతి. కోశాగారంలో పని వత్తిడి అధికం కావడంతో, అతడు మంత్రిని, మరిద్దర్ని సహాయకులుగా నియమించేందుకు అనుమతి కోరాడు. మంత్రి సరేనని, వాళ్ళకు నెలకు పన్నెండు వరహాల జీతం యివ్వమన్నాడు. కాని, కనకగుప్తుడు ముగ్గురికి ఉద్యోగాలిచ్చాడు.

ఈ సంగతి విన్న మంత్రికి చాలా కోపం వచ్చింది. ఆయన కనకగుప్తుణ్ణి, యీ విషయమై ఏమీ ప్రశ్నించకుండా, రాజు రమాకాంతుడి దగ్గిరకు పోయి, ''ప్రభూ, మన కోశాగారాధిపతి కనకగుప్తుడు, తనకు పనివత్తిడిగా వున్నదనీ, మరిద్దర్ని సహాయకులుగా నియమించుకుంటాననీ చెప్పి, నా అనుమతి కోరాడు. కాని, యిప్పుడు ముగ్గురికి ఉద్యోగాలిచ్చాడు.'' అని చెప్పాడు.

''ఇది ఉత్తర్వులను ఉల్లంఘించడం. సరిఅయిన పద్ధతి కాదు,'' అన్నాడు రాజు కోపంగా.

ఆయన కోశాధికారిని పిలిపించి సంజాయిషీ అడిగాడు.

''ప్రభూ, మంత్రిగారు యిద్దర్ని మాత్రమే ఉద్యోగంలోకి తీసుకుని, తలొక పన్నెండు వరహాల జీతం యివ్వమని చెప్పింది వాస్తవం. అయితే, నేను జీతం ఎనిమిది వరహాలు చేసి ముగ్గురికి ఉద్యోగం యిచ్చాను,'' అన్నాడు కోశాధికారి కనకగుప్తుడు.

రాజు అతడికేసి కోపంగా చూస్తూ, ''నువ్వు అలా ఎందుకు చేశావో తెలుసుకునేందుకే, నిన్నిక్కడికి పిలిపించాను,'' అన్నాడు.

కనకగుప్తుడు ఎంతో వినయంగా, ''ఆ ఉద్యోగాలకు మంత్రిగారే యిద్దర్ని

కమలిని

పంపారు. ఆ వ్యక్తులెవరో తెలిశాక, మరొకడు కూడా వుంటే మేలనిపించింది," అన్నాడు.

రాజు మందలిస్తున్నట్టు, "నువ్వు చెప్పదలచినదేదో సూటిగా చెప్పడం అవసరం," అన్నాడు.

అప్పుడు మంత్రి కల్పించుకుని, "ప్రభూ, నేను పంపిన యిద్దరూ చాలా నమ్మకస్థులు; సమర్థులు. ఆ కారణం వల్లనే, యీ నియామకాల విషయంలో కొంత అసక్తి కనబరిచాను," అన్నాడు.

"మంచి పనిచేశారు! ధనంతో సంబంధించిన వ్యవహారం. కోశాగారంలో పని చేసే వాళ్ళకు నిజాయితీకి తోడు సమర్థత కూడా అవసరమే," అని రాజు, కనకగుప్తుడి కేసి చూశాడు.

"ప్రభూ, మంత్రిగారు ఉద్యోగానికి పంపిన వాళ్ళలో ఒకరు, ఆయన స్నేహితుడి కొడుకు. మరొకరు మహారాణి వారి దూరపు బంధువు," అన్నాడు కనకగుప్తుడు.

ఆ మాటలకు రాజు చిన్నగా నవ్వి, "ఏం, అలాంటివాళ్ళు, కోశాగారంలో చిన్న ఉద్యోగాలకు కూడా అర్హులు కారనా, నీ ఉద్దేశం?" అని అడిగాడు.

"ఇది అర్హతను గురించిన సమస్య కాదు, ప్రభూ! అలాంటి పలుకుబడిగల వాళ్ళచేత, నేను ఒళ్ళు వంచి పని చేయించడం చాలా కష్టసాధ్యం. అందుకని మరొక సామాన్యుణ్ణి కూడా పనిలోకి తీసుకున్నాడు. అవసరం అయితే, వాళ్ళిద్దరి పనీ అతడిచేత చేయించవచ్చని, అలా చేశాను. అయినప్పటికీ, మంత్రిగారు చెప్పినదానికన్న హెచ్చువ్యయం కాకుండా జాగ్రత్తపడ్డాను," అన్నాడు కనకగుప్తుడు.

రాజు, మంత్రికేసి చూశాడు. మంత్రి తలవంచుకుని వూరుకున్నాడు.

ఆ తరవాత రాజు; జరగవలసిన పనుల అవసరాలు దృష్టిలో వుంచుకుని, ఎలాంటి ఆశ్రితపక్షపాతం లేకుండా, అర్హులైన వాళ్ళకే ఉద్యోగా లివ్వాలంటూ, శాసనం ఝారీ చేశాడు.





# సమతూకం

వివాహం అయి, అత్తవారింటికి కాపరానికి వస్తూనే అమల, తన భర్త ఆదిత్య ప్రతి స్వల్ప విషయాని క్కూడా, అతిగా మాట్లాడుతూండడం గమనించింది. ఈ ధోరణి ఆమెకు చిరాకు పుట్టించడంతో, మొదట మృదువుగానూ, తరవాత కొంత కటువుగానూ చెప్పి చూసింది. అయినా, ఆదిత్యలో చిన్నమెత్తు మార్పు కూడా రాలేదు. దానితో అమల, భర్త మీద పంతం పట్టినట్టు, అతడితోనే కాక, పరిచయస్థులతో కూడా అవును, కాదనడాన్ని మించి మాట్లాడడం మానేసింది.

ఒకసారి అమల స్నేహితురాలి పెళ్లికి పట్నం వెళ్ళవలసి వచ్చింది. ఈ సంగతి విన్న ఆదిత్య, ''తప్పక వెళ్ళిరా! అన్ని బంధాలకన్న బలమైనది, స్నేహబంధం. స్నేహితుల మధ్య స్వార్థానికి తావుండదు. బంధువులు రాబందుల్లాంటివాళ్ళు; బతికుండగానే పీక్కు తినేస్తారు. నిజంగా కష్టాల్లో ఆదుకునేది స్నేహితులే. పెళ్ళి జీవితంలో అతి ముఖ్యమైన వేడుక. స్నేహితుల పెళ్ళికి హాజరవడం ఎంతయినా అవసరం,'' అన్నాడు గుక్క తిప్పుకోకుండా.

అమల అయిష్టంగా ముఖం చిట్లించి, ''వెళ్ళిరా, అని ఒక్కమాటతో సరిపెట్టక, ఈ సోదంతా దేనికి?'' అని విసుక్కుంటూ స్నేహితురాలి పెళ్ళికి బయలుదేరింది.

పట్నంలో ఆమె, తన స్నేహితురాలిని మాత్రం పలకరించి, నలుగురిలో కలవక ఒక పెడగా కూర్చుని, పెళ్ళి తంతు చూసింది.

పెళ్ళికి వచ్చిన వాళ్ళల్లో చాలామంది అమలను చాలా గర్విష్ఠి అంటూ గుసగుస లాడారు. ఆ మాటలు చెవిని

మాచిరాజు కామేశ్వరరావు



పడినా, ఆమె మరెవరితో ఒక్కమాట కూడా మాట్లాడ లేదు.

భోజనాలు కాగానే, ఆమె తన స్నేహితు రాలికి వెళుతున్నానని చెప్పి, బాడుగ బండి కోసం, నాలుగు వీధుల కూడలి లోకి వచ్చింది. అమల బండివాడెవడైనా కనబడతాడేమో అని చూస్తూండగా, ఆమె పక్కింటి సుందరమ్మా, భర్తా, బండిలో ఎక్కడినుంచో వస్తూ కనిపించారు. వాళ్లు అమలను చూసి బండి ఆపించారు. అయితే, అమల వాళ్ళను చూడనట్టుగా మొహం మరోవైపుకు తిప్పుకున్నది. అది అవమానంగా భావించి సుందరమ్మా, భర్తా అక్కడినుంచి వెళ్ళిపోయారు.

అమల ఎంతసేపు నిలబడినా మరొక బాడుగబండి ఆ వైపుకు రాలేదు. చివరకు సూర్యాస్తమయ సమయంలో ఒక ఖాళీ బండివాడు అటుగా వచ్చాడు. ఆమె, వాడికి రెట్టింపు బాడుగ ఆశ చూపగా, వాడు వాళ్ళ గ్రామం రావడానికి ఒప్పుకున్నాడు.

అమల వాళ్ళ గ్రామం సగం దూరంలో వున్నదనగా, బాగా చీకటి పడిపోయింది. ఆ దారి వెంట ఎలాంటి జన సంచారం లేదు. అలాంటిచోట బండివాడు చప్పున బండిని ఆపాడు.

అమల అదుర్దాగా, "ఆపావెందుకు? ఏం జరిగింది?" అని వాణ్ణి అడిగింది.

"ఇంకా ఏం జరగలేదు! నువ్వు బండి దిగి, మర్యాదగా దగ్గిర వున్న డబ్బూ, మెడలోని హారం యిచ్చెయ్యి." అంటూ బండివాడు చిన్న కత్తిని దుస్తుల్లోంచి బయటికి లాగాడు.

అమలకు నోటమాట రాలేదు. ఆమె వణుకుతూ చప్పున బండి దిగి, తన దగ్గిరవున్న వంద రూపాయలు బండివాడి చేతిలో పెట్టింది.

"హారం కూడా యివ్వు ఊ, త్వరగా!" అన్నాడు బండివాడు కరుకుగా.

అమల కళ్ళనీళ్ళు పెట్టుకుని హారం తీయబోతూండగా, పట్నం వైపు వెళ్ళే

బండొకటి, అటుకేసి వేగంగా రావడం కనిపించింది. వెంటనే బండివాడు, అమల మెడలోని హారాన్ని గట్టిగా లాగాడు. హారం చాలా సన్నగా వుండడంతో, తెగి కిందబడింది.

చీకట్లో దాన్ని వెతికే ధైర్యంలేక బండివాడు, ఎద్దును అదిలించి పట్నం వైపుకు వెళ్ళిపోయాడు.

కిందపడిన హారాన్ని కొంగులో కట్టుకుని, అమల కాలినడకన తమ గ్రామం చేరింది.

సంగతి విన్న ఆదిత్య లబలబలాడిపోతూ, "ఎంత తెలివితక్కువ పని! సుందరమ్మతో మాట్లాడి, వాళ్ళ బండిలో వచ్చేసి వుంటే యిలా జరిగేదా? ఆడదాన్ని ఒంటరిగా పంపించడం, నేను చేసిన మొదటి తప్పు. వంద రూపాయలు యిచ్చి పంపడం, రెండో తప్పు. బంగారు హారం చేయించడం మూడో తప్పు...." అని, యింకా ఏదో చెప్పబోయాడు.

ఆ సమయంలో పనిమనిషి రంగమ్మ రావడం చూసిన అమల, భర్త మాటలకు అడ్డుపడి, "నీ తప్పుల దండకం మరొకసారి వింటాను. తెగిన హారం యివ్వాళ, మీ కొట్టులో అతికించి పట్టుకురా!" అన్నది.

ఆదిత్య, ఆ గ్రామంలో వున్న ఒక పెద్ద నగల దుకాణంలో పని చేస్తూంటాడు. వంద రూపాయలు పోవడంతో, ఆ రోజంతా అతడికి మనసు, మనసులో





లేదు. భోజనంచేసి దుకాణానికి వెళుతూ, హారం పట్టుకుపోవడం మరిచాడు.

ఆ రోజు బట్టతలమనిషి ఒకడు, ఏవో నగలు కావాలంటూ దుకాణానికి వచ్చాడు. ఆదిత్య చూపిన కొన్ని నగలు చూశాక, హారాలేవైనా వుంటే చూపమన్నాడు.

ఆదిత్య అతడికి రకరకాల హారాలు తెచ్చి చూపి, వాటి పనితనం వర్ణిస్తూ మాట్లాడసాగాడు.

బట్టతలమనిషి తలాడిస్తూ, "నేను గుడ్డివాణ్ణేం కాదు. నువ్వు, వీటి గురించి, చెప్పిందే మరొకసారి చెప్పనవసరం లేదు అన్నీ మోటుగా వున్నవి. సన్నగా, నాజూకుగా వుండే హారాలు, మీ దుకాణంలో లేవా?" అని అడిగాడు.

అన్నిరకాల హారాలు చూసి అతను నచ్చలేదనేసరికి, ఆదిత్య కోపం తెచ్చుకుని, "మీరేం అనుకోకండి. అంతగా తెలివిలేనివాళ్ళే, సన్నపాటి హారాలు కొంటారు. అసలు నిన్న ఏం జరిగిందో తెలుసా?" అంటూ భార్యకు కలిగిన అనుభవం గురించి చెప్పి, "హారం అంత అల్పంగా వుండబట్టే, ఆ దొంగ వెధవ పట్టుకులాగగానే తెగిపోయింది. మా ఆవిడ దాన్ని అతికించి తెమ్మన్నది. దుకాణానికి తేవడం మరిచాను. తెచ్చి వుంటే, మీకు చూపించి వుండేవాణ్ణి," అన్నాడు.

బట్టతల మనిషి చిరాకుపడుతూ, "దోపిడీ దొంగలకు లావుపాటి హారాలు, మరీ ఇంపుగా కనిపిస్తాయి! మీ దుకాణంలో నాకు కావలసినవి లేకపోతే, ఆ మాట చెప్పు. ఈ సోదంతా ఎందుకు?" అని వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం ఆదిత్య ఇల్లు చేరగానే, అమల, "హారం అతుకు పెట్టడం అయిందా?" అని అడిగింది.

"అసలు తీసుకువెళ్ళిందే! రేపు కొట్టుకు వెళ్ళేముందు జ్ఞాపకం చెయ్యి," అన్నాడు ఆదిత్య.

అమల నిర్ఘాంతపోతూ, "హారం నీకు చేరలేదా ?" అని అడిగింది.

జరిగిందేమంటే; మధ్యాహ్నం వేళ ఒక బట్టతల మనిషి ఆదిత్య ఇంటి తలుపు తట్టి, అమల తలుపు తీయగానే, "పొద్దున అయ్యగారు హారం తీసుకు పోవడం మరిచారట. తీసుకు రమ్మని నన్ను పంపారు. ఇంకా నయం, ఆ బందిపోటు మీకేం అపకారం తలపెట్టలేదు," అన్నాడు.

ఆ వచ్చినవాడు జరిగినదంతా వివరంగా చెప్పడంతో, అమల అతణ్ణి ఏమాత్రం అనుమానించక హారం తెచ్చి వాడి చేతికిచ్చింది.

"ఎవడో బట్టతలవాడికి, మాటల సందర్భంలో అదంతా చెప్పాను. వాడింత దుర్మార్గుడని, నేను గ్రహించలేదు," అన్నాడు ఆదిత్య నివ్వెరపోతూ.

"అడ్డమైన వాళ్ళకు ఇంటి గొడవలు చెప్పి, యింత నష్టానికి కారణం అయ్యావు. అతిగా మాట్లాడే దురలవాటే, దీనికంతకూ మూలం," అన్నది అమల కోపంగా.

ఆ సమయంలో అక్కడికొచ్చిన పని మనిషి రంగమ్మ, యీ మాటలు విని, ఆ భార్యాభర్తలతో, "మీరు కోపగించుకోకపోతే, ఒక చిన్నమాట చెబుతాను! అమ్మగారు అసలు మాట్లాడక, వంద రూపాయలు పోగొట్టుకున్నారు. అయ్యగారు అతిగా మాట్లాడడంవల్ల, హారం పోయింది. అమ్మగారు అతిగా మాట్లాడనని, నన్ను పనిలో పెట్టుకున్నారు. పక్కింటి సుందరమ్మగారు, అడిగిందే తడవుగా నేను రకరకాల కబుర్లు చెబుతానని పనిలో పెట్టుకున్నారు. ఎదుటి మనుషులనుబట్టీ, అవసరాన్ని గమనించీ అన్ని విషయాల్లోనూ సమతూకంగా మాట్లాడడం మంచిది !" అన్నది.

రంగమ్మ చదువుకున్నది కాకపోయినా, అనుభవం ద్వారా ఆమె చెప్పిన మాటల్లో ఎంతో సత్యం కనిపించింది, ఆ భార్యాభర్తలకు.





# దుండగీడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో ఒకప్పుడు బోధిసత్త్వుడు, దేవతలకు అధిపతి ఐన దేవేంద్రుడుగా వుండటం తటస్థించింది.

బ్రహ్మదత్తుడు అప్పుడు మంచి నడి వయసులో ఉన్నాడు. దేవుణ్ణే లెక్క చేయని బ్రహ్మదత్తుడికి మానవులనగా ఏపాటి? వయసులో ఉంటూ వున్న బ్రహ్మదత్తుడికి జంతువులన్నా, మనుషులన్నా, వస్తువులన్నా అదొక విధమైన రోతగా కనబడేది.

వయసు మీరిన జంతువులేవైనా సరే- గుర్రాలు కానీ, ఏనుగులు కానీ, మరేవైనా కానీ కంటపడితే, వెంటనే వాటిని తరిమి తరిమి కొట్టేవాడు. పాతబడిన బళ్ళుకాని, యింకేదైనా వస్తువుకాని కనిపిస్తే చాలు, ఆ క్షణమే ముక్క చెక్కలుగా చేసి పారవేసేవాడు.

వయసు గడచిన మనుష్యులు—అనగా వృద్ధులు ఎదటపడితే, వాళ్ళ నెరసిన గడ్డాలు పట్టుకు లాగేవాడు. వాళ్ళను పాత్రలు దొర్లించినట్టుగా కింద పడుకో బెట్టించి దొర్లించేవాడు. ఆ వృద్ధులు స్త్రీలయితే, నానా హింసలూ పెట్టేవాడు.

బ్రహ్మదత్తుడు చేసే ఈ అర్థం లేని ఆటలకూ, దుండగాలకూ ఒక మితీ, మేరా లేకపోయింది. ఇంద్రుడి లక్ష్యమూ, చంద్రుడి లక్ష్యమూ లేకుండా సంచరించే ఆ రాజకుమారుణ్ణి ఎదిరించటానికి ఎవళ్ళకూ తరం కాలేదు.

ఇలా రాజు చేసే దుర్నయాలకూ, యాతనలకూ ప్రజలు కటకటలాడి పోసాగారు. చేసేది లేక తల వంచుకున్నారు. వృద్ధులైన తమ తల్లిదండ్రులను రాజ్యం దాటించి ఇతర ప్రదేశాలకు చేర్చుకొన్నారు. ఈ విధంగా తల్లిదండ్రులను దూర

దేశాలలో దిగబెట్టి, వారికి ఎడబాపులై వుండటం తప్ప మరి గత్యంతరం లేక పోయింది.

ఇలా ప్రజ తల్లిదండ్రులను విడిచిపెట్టి ఉండటం వల్ల వారు మహాపాపం చేసిన వారయ్యారు. ఇటువంటి పాపాత్ములతో రౌరవాది నరకాలన్నీ నిండిపోజొచ్చినై. స్వర్గలోకమంతా ఖాళీగా ఉండిపోయింది.

స్వర్గలోకంలో తగినంత పని కనబడక పోయేసరికి దేవేంద్రుడు తల్లడిల్లాడు. లాభమేముంది? దూరం యోచించి, ఒక పన్నాగం పన్నాడు.

దేవేంద్రుడు కడుపేద ఐన ఒక శత వృద్ధు రూపం తాల్చాడు. రెండు జాడీలలో మజ్జిగ నింపి, శిథిలావస్థలో వుండే ఒక బండిలో పెట్టాడు. ఆ బండికి రెండు బక్క ఎద్దులను పూన్చి, బయలుదేరాడు.

ఈ విధంగా దేవేంద్రుడు వెళుతూండగా—అతి వైభవంగా గొప్ప ఊరేగింపుతో గజారోహణం చేసి వస్తున్న బ్రహ్మదత్తుడు యెదురయ్యాడు. రాజుకోసం నగరమంతా ఆనాడు కలకలలాడుతూ అలంకరించబడింది!

బండి మీద ముసలివాణ్ణి చూస్తూనే రాజు, "పోరా, అవతలకి. తప్పుకోరా! ఏమిటింత పొగరు?" అంటూ కేకలు వేశాడు.



పక్కనున్న ప్రజకు ఇదంతా ఆశ్చర్యం కొలిపింది. 'ఏమిటి, రాజు ఇలా కేకలు వేస్తాడెందుకో!' అని అనుకొన్నారు. చిత్రమేమిటంటే – మారువేషంలో వున్న ఆ దేవేంద్రుడు ఒక్క రాజుకే కనిపిస్తున్నాడు. కాని ప్రజలలో ఒక్కళ్ళకూ గోచరించటం లేదు. దేవేంద్రుడి మహిమ వల్లనే ప్రజల కళ్ళకు మాయ కమ్మింది!

అలా కోపంతో కేకలు వేసే రాజు మీదికి పోయి, వృద్ధుడు తన బండిలోని ఒక మజ్జిగ జాడీ తీసి రాజు నెత్తి మీద పగలగొట్టాడు.

భయంతో రాజు ఏనుగు పైనుండి పారిపో జూసాడు. అప్పుడు దేవేంద్రుడు

రెండవ జాడీ కూడా తీసి రాజు తలకు వేసి కొట్టాడు. ఆ మజ్జిగ ఒలికి రాజు వళ్ళంతా తడిసిపోయింది. రాజు ఉగ్రుడయ్యాడు.

ఆ సమయంలో దేవేంద్రుడు ఎక్కి వచ్చిన బండి అదృశ్యమైపోయింది. మజ్జిగ జాడీలు కనపడకుండా పోయినై. అప్పుడు దేవేంద్రుడు స్వస్వరూపంతో రాజు ఎదుట సాక్షాత్కరించాడు.

పాదాక్రాంతుడైన రాజును చూసి దేవేంద్రుడు :

''ఏమి రాజా! పొగరుబోతుదనము ఎవరికి, నీకా, నాకా? కన్నుకానని గర్వంతో ఎవరు మిట్టిపడుతూ వున్నారు? నీవా, నేనా? ఎల్లప్పుడూ ఈ యౌవనంలో ఇలానే వుండిపోతావా నీవు? నీకు వృద్ధాప్యం రాదా? ముసలివారినీ, పాత వస్తువులనూ గేలి చేస్తావా? నీ దుశ్చేష్టల వల్ల రాజ్యంలో ప్రజలు యెంత బాధపడుతున్నారో తెలుసుకున్నావా? నువ్వు పెట్టే యాతనలవల్ల వాళ్ళందరూ కన్న తల్లిదండ్రులను దూర ప్రదేశాలకు పంపివేసి, వారి రక్షణ చూడలేని మహాపాపులవుతున్న సంగతి కొంచెమైనా గుర్తించావా? ఈ విధంగా నరకలోకాలు నిండిపోవటం, స్వర్గానికి ఒక్కళ్లూ రాకపోవటం గమనించావా? ఈ క్షణం నుంచి ఐనా బుద్ధి తెచ్చుకొని, తప్పు దిద్దుకుని, సరిగా ప్రవర్తించు. లేకుంటే, ఇదుగో ఈ పిడుగు వచ్చి, నీ తలనూ, మొండెమునూ వేరు చేస్తుంది. జాగర్త!'' అని హెచ్చరించి, అదృశ్యమయ్యాడు.

నాటి నుంచీ బ్రహ్మదత్తుడి ప్రవర్తన పూర్తిగా మారిపోయింది. అతడు వృద్ధులను గౌరవింపసాగాడు.

అందువల్ల ఇంతకుముందు రాజ్యంలో కలిగిన అలజడి తగ్గింది. ప్రజలు వాళ్ళ వాళ్ళ తల్లిదండ్రులను మళ్ళీ ఆ దూర ప్రాంతాల నుండి తిరిగి తెచ్చుకొని, సేవించి సుఖంగా ఉంటూ వచ్చారు. బోధిసత్వుడి ప్రభావం వల్ల ఇంతటి మార్పు కలిగింది.





# కంపెనీ యుగం

పద్ధెనిమిదవ శతాబ్దారంభంలో బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ క్రమంగా భారత దేశాన్ని తన అదుపులోకి తేవడానికి కృషి చేయసాగింది. ఓడలు, ఓడలుగా బ్రిటిష్ వర్తకులు భారతదేశానికి రాసాగారు. కాని, భారతదేశంలోని సరకులు, నాణ్యతలో బ్రిటిష్ సరకులకు తీసిపోనివి కావడంతో, బ్రిటిష్ సరకులకు అంతగా గిరాకీ తగలలేదు.

అందువల్ల, తరచూ ఈస్టిండియా కంపెని మనుషులు మన దేశంలోని, నేర్పరులైన నేతగాళ్ళ ఇళ్ళపై దాడిజరిపి, మగ్గాలు నాశనం చేసి, వాళ్ళను కొట్టి వికలాంగులను చేయసాగారు. ఆవిధంగా వాళ్ళు వ్యాపారంలో తమతో పోటీ పడకుండా చేయాలని కంపెని వర్తకులు ప్రయత్నించారు.






కంపెనీవాళ్ళు కొన్ని ప్రాంతాల్లో నీలి పంట పైరుచేసి, చుట్టుపక్కల కూలీలను పనిలోకి తీసుకున్నారు. తమ తృప్తిమేరకు పని చేయని వ్యవసాయ కార్మికులను గొడ్లను బాదినట్లుబాది, ఇవ్వవలసిన కూలీ ఇవ్వకుండా తరిమి వేయసాగారు.



దేశంలోని చిన్న చిన్న రాజుల నుంచీ, జమీందారుల నుంచీ అధికారాన్నీ, ఆస్తిపాస్తులనూ, రకరకాల కుయుక్తులతో కాజేయసాగింది కంపెనీ దొరతనం. ఆ విధంగా ఈస్టిండియా కంపెనీ కేవలం వ్యాపారసంస్థగా కాకుండా భారతదేశంలో పెద్ద జమీందారీగా రూపాంతరం చెందింది.

కంపెనీ, వారన్ హేస్టింగ్స్‌ను బెంగాల్ గవర్నరుగా నియమించింది. బెంగాల్‌కు చెందిన రాజా నందకుమార్ వారన్ హేస్టింగ్స్ లంచగొండితనం గురించి, పైవారికి ఫిర్యాదు చేశాడు. కాని హేస్టింగ్స్ మిత్రుడు ఇంపే — న్యాయమూర్తి కావడంతో నందకుమార్‌పై దొంగసంతకాలు చేశాడన్న నేరం మోపి అతనికి ఉరిశిక్ష విధించాడు.





పుణ్యస్థలాలను సందర్శించే కొందరు సాధువులపై బ్రిటిష్ కంపెనీ పన్ను విధించడంతో, సాధువులూ సన్యాసులూ దానికి బద్ధశత్రువులై ఎదురుతిరిగారు. ఆ విధంగా బ్రిటిష్ అధికారాన్ని ఎదిరించిన వాళ్ళలో సాధువులు, సన్యాసులు మొట్టమొదటి వారయ్యారు!

భవానీ పథక్, దేవీ చౌధురాణీ అనే ఇద్దరు ప్రముఖులు సాధువుల తిరుగుబాటుకు నాయకత్వం వహించారు. ముఖ్యంగా చౌధురాణీ అనే ధీర వనిత—పడవ మీదే ఇల్లు నిర్మించుకుని పయనం చేస్తూ, చిన్న చిన్న పడవలలో వున్న వీరులకు నాయకత్వం వహించి, అనమానమైన ధైర్యసాహసాలు ప్రదర్శించింది.





దేవీ చౌధురాణీ అనుచరులు, హఠాత్తుగా కంపెనీ ఓడల మీదికి దాడి జరిపి, వాటిని ముంచి, మరుక్షణమే మెరుపుల్లా, అడవులగుండా ప్రవహించే నదులమీదుగా పారిపోయేవారు.

సాధువుల తిరుగుబాటు తరవాత, తూర్పు, మధ్య భారతదేశంలోని రైతులు కంపెనీ దొరతనంపై ఎదురు తిరగడం ప్రారంభించారు. అయినా తుపాకీల సాయంతో కంపెనీ, ఆ తిరుగుబాటును దారుణంగా అణచివేసింది. కంపెనీ అధికారం పల్లెటూళ్ళ వరకూ వేళ్ళూనింది.





అయినప్పటికి కంపెనీ అధికార విస్తరణ, అభివృద్ధి అంతసాఫీగా సాగలేదు. కర్ణాటకప్రాంతంలోని కిత్తూరు రాజు, ఇరువురు కుమారులను వారసులుగా వదిలి మరణించాడు. కుమారుల తరఫున రాణి చెన్నమ్మ సమర్థవంతంగా రాజ్యపాలన చేయసాగింది.

దురదృష్టవశాత్తు రాకుమారులు ఇద్దరూ మరణించారు. పెద్ద యువరాజు దత్తు కుమారుణ్ణి వదలివెళ్ళినప్పటికీ — కిత్తూరు రాజ్యాన్ని వారసులు లేని రాజ్యంగా కంపెనీ ప్రకటించింది. రాజ్యాన్ని వశపరచుకోడానికి కంపెనీ సైనికులు వచ్చారు. అయినా, రాణీ చెన్నమ్మ స్వయంగా తన సైన్యానికి నాయకత్వం వహించి, బ్రిటిష్ కంపెనీ సైన్యాన్ని ఎదుర్కొన్నది.





రాణీగారి సైనికులు కోటపై నుంచి ఫిరంగులు పేల్చి, బ్లాక్, డిప్టన్ అనే బ్రిటిష్ సేనానాయకులనూ, థాకరే అనే కంపెనీ ప్రతినిధినీ చంపారు. **1824** వ సంవత్సరంలో జరిగిన ఆ యుద్ధంలో మొదట కంపెనీ సైనికులు ఓడిపోయినప్పటికీ, ఆ తరవాత వాళ్లు పెద్ద సైన్యంతో వచ్చి, రాణీ చెన్నమ్మను ఓడించి, ఖైదు చేశారు. అయినా ఆమె ప్రారంభించిన తిరుగుబాటు ఉద్యమం చల్లారలేదు.



# మూడు వరాలు

ఐనవరం అనే గ్రామంలో వెంకన్న అనే పశువుల కాపరి వుండేవాడు. వాడి భార్య పేరు పూర్ణమ్మ. వెంకన్న ఏమంత తెలివి గలవాడు కాదు. కాని, పూర్ణమ్మ చాలా తెలివిమంతురాలు. ఆ కారణంగా వెంకన్న, ప్రతి చిన్న విషయంలోనూ భార్య సలహా ప్రకారం నడుచుకుంటూండేవాడు. ఆ దంపతుల ఆస్తి, గ్రామంలో ఒక చిన్న ఇల్లూ, రెండు పాడి ఆవులూ మాత్రమే. వెంకన్న రోజు తప్పకుండా ఆవులను అడవికి తోలుకుపోయి మేపుకు వస్తూండేవాడు.

ఆ అడవిలో కొంతకాలంగా ఒక ముని పర్ణశాల నిర్మించుకుని, దాపులనున్న చెట్టు కింద తపస్సు చేసుకుంటూండేవాడు. ఆయనను వెంకన్న చాలాసార్లు చూశాడుగాని, ఏ నాడూ పలకరించేందుకు ప్రయత్నించలేదు. ముని ఎప్పుడూ పద్మాసనం వేసుకుని, కళ్ళు మూసుకుని ధ్యానంలో వుండేవాడు.

ఒకనాడు వెంకన్న అడవిలో పశువులను మేపుతూండగా, ఉన్నట్టుండి పెద్ద గాలీ వానా ప్రారంభమై చెట్లకొమ్మలు ఫెళఫెళమంటూ విరిగి పడసాగినై. ఇక అక్కడ వుండడం క్షేమం కాదని, వెంకన్న తన పశువులతో ఇంటిదారి పట్టాడు.

వాడు ముని వుండే పర్ణశాల ప్రాంతానికి రాగానే, చెట్టు కింద ముని కనిపించలేదు. అక్కడ చెట్టుకొమ్మలు విరిగి చిందరవందరగా పడి వున్నవి. ముని ఏమై పోయి వుంటాడా అనుకుంటూ, వెంకన్న చెట్టు దగ్గిరకు పోయి చూశాడు. ముని కొమ్మల కింద కదలా మెదలక పడి వున్నాడు.

వెంకన్న గబగబా పోయి మునిని కొమ్మల కింది నుంచి బయటికి లాగి,

వల్లూరు బాబురావు



భుజాన వేసుకుని పర్ణశాలలోకి తీసుకు పోయాడు.

అప్పుడు ముని కళ్ళు తెరిచి, "నువ్వెవరు? ఏం జరిగింది?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

గాలి వాన తాకిడికి చెట్టుకొమ్మలు విరిగి పడడం గురించి వెంకన్న, మునికి వివరంగా చెప్పి, "తమరు గొప్ప తపశ్శక్తి గలవారు. అందుకే అంతంత లావు కొమ్మలు విరిగి మీద పడినా, శరీరానికి ఎటువంటి చిన్న గాయం కూడా కాలేదు! ఇక నాకు సెలవిప్పించండి, వెళతాను," అని అక్కడి నుంచి బయలుదేర బోయాడు.

ముని వాణ్ణి ఆగమని, "నువ్వు భూత దయా, జాలిగుణం గలవాడిలా వున్నావు. నీకు తోచిన మూడు వరాలు కోరుకో, యిస్తాను," అన్నాడు.

వెంకన్న కొంచెంసేపు ఆలోచించి, "ఏం కోరుకోవాలో నాకు తెలియడం లేదు. ఇంటికిపోయి, నా భార్య నడిగి వస్తాను," అన్నాడు.

"అలాగే చెయ్యి! అయినా, మళ్ళీ యింతదూరం తిరిగి రానవసరం లేదు. మీ భార్యాభర్తలు సంప్రతించుకున్నాక, నువ్వు ఏవి కోరుకుంటే అవి తక్షణమే లభ్యమవుతాయి," అని చెప్పాడు ముని.

వెంకన్న సంతోషంగా ఇంటికి తిరిగి వచ్చి, భార్య పూర్ణమ్మకు జరిగినదంతా చెప్పాడు.

పూర్ణమ్మ చాలాసేపు ఆలోచించి, "ఉన్నంతలో మనం సుఖంగా బతుకుతున్నాం. అయినా, అంత గొప్ప మునీశ్వరుడు యిచ్చిన వరాలను, మనం ఉపయోగించుకోకపోవడం మంచిది కాదు. నేను చెప్పినట్టు కోరుకో! ఒక చీపురు, ఒక కర్ర, పశువులను కట్టివేసే ఒక పలుపుతాడు—ఇవి చాలు మనకు," అన్నది.

వెంకన్నకు విలువలేని యింత చిన్న వస్తువులు కోరుకోవడం, ఏమాత్రం యిష్టం

లేదు. అయినా, అతడికి భార్య తెలివి తేటల్లో చాలా నమ్మకం వున్నది. అందు వల్ల వెంకన్న, ఆమెకు అడ్డు చెప్పకుండా భార్య కోరుకోమన్న విధంగానే కోరు కున్నాడు.

వెంటనే ఆ మూడు వస్తువులూ అక్కడ ప్రత్యక్షమయినై. పూర్ణమ్మ కర్రను భర్త కిచ్చి, పలుపుతో ఆవులను కట్టివేసి, చీపురుతో సంతోషంగా ఒకసారి ఇల్లంతా ఊడ్చింది.

మర్నాడు వాడు ఆవులను తోలుకుని అడవికి వెళ్ళేసరికి, ముని తాను కూర్చునే చోట విరిగిపడిన చెట్టుకొమ్మలను దూరంగా లాగి, ఆ ప్రదేశాన్ని శుభ్రపరుస్తూ కని పించాడు.

ఆయన వెంకన్నను చూస్తూనే, చిరు నవ్వుతో, "ఏం, వరాలు కోరుకున్నావా ?" అని అడిగాడు.

వెంకన్న మునికి నమస్కరించి, "కోరుకున్నాను, స్వామీ! ఒక చీపురు, ఒక కర్ర, పశువులను కట్టివేసే ఒక పలుపుతాడూ," అన్నాడు.

ఆ జవాబు వింటూనే ముని ఆశ్చర్య పోయి, "నా తపశ్శక్తినెంతో ధారపోసి యిచ్చిన వరాలను, యింత అల్ప వస్తు వుల కోసం వినియోగించావేమిటి ?" అన్నాడు.

"నేను అన్ని పనులూ, నా భార్య సలహాప్రకారంచేస్తూంటాను. ఆమే, యిలా కోరుకోమన్నది," అన్నాడు వెంకన్న.



ఈ జవాబు విన్న మునికి, వెంకన్న భార్య అలా ఎందుకు కోరుకోమన్నదో తెలుసుకోవాలన్న కుతూహలం కలిగింది. ఆయన వెంకన్నతోపాటు అతడి ఇంటికి వచ్చి, పూర్ణమ్మను, "అమ్మా, నేను మీ కెంతో మేలు కోరి యిచ్చిన వరాలను, ఏ మాత్రం ప్రయోజనం లేని వస్తువులు సంపాయించేందుకు ఉపయోగించా వెందుకు? ఏ సిరిసంపదలో కోరుకుంటే బావుండేది గదా?" అని అడిగాడు.

పూర్ణమ్మ, మునికి తలవంచి నమస్కరించి, "స్వామీ, మీ వరాల ప్రభావంతో, మాకు సిరిసంపదలు కలిగేలా చేసుకో వచ్చు. కాని, నడమంత్రపు సిరి, నరాల మీద పుండులాంటిదని, మీకు తెలియంది కాదు. కష్టపడకుండా లభించిన ధనం, మనుషులకు మేలు కన్న కీడే ఎక్కువ చేస్తుంది!" అన్నది.

"ఆ మాటా నిజమే! అయినా కుతూహలం కొద్దీ అడుగుతున్నాను. నా మూడు వరాలను మరీ యింత అల్ప వస్తువుల కోసం ఎందుకు ఉపయోగించావు?" అన్నాడు ముని.

"స్వామీ, అవేం అల్పవస్తువులు కావు. మీ వరప్రభావంవల్ల వచ్చిన చీపురుతో ఇల్లు ఊడిస్తే, ఇల్లు కళకళలాడి లక్ష్మి తాండవిస్తుంది. మీ దయవల్ల మాకు లభించిన కర్ర, ఆపద సమయాల్లో రక్షగా నిలుస్తుంది. వరప్రసాదమైన పలుపు తాడుతో, మా ఆవులను కట్టి వేయడం అంటే—పాడిని అన్నివేళలా ఇంట కట్టి వేసినట్టే గదా! ఈ విధంగా, మీ వరాల వల్ల, మాకు బతికినన్నాళ్ళూ, ఎందులోనూ లోటంటూ వుండదు," అన్నది పూర్ణమ్మ.

పూర్ణమ్మ తెలివితేటలకు, ముని ఆశ్చర్య పడ్డాడు. తన వరాలు ఎంత వింతగా, ఆ గృహాన్ని కాపాడతాయో గ్రహించడంతో, ఆయనకు చాలా ఆనందం కలిగింది. తరవాత ఆయన, ఆ దంపతులను ఆశీర్వదించి, అడవిలోని తన పర్ణశాలకు వెళ్లిపోయాడు.





# అధికారం

రాజ్యాభిషేకానికి ముందు, యువరాజు దేశసంచారం చేయడం చందనదేశపు ఆచారం. ఆ ఆచారప్రకారం యుక్త వయస్కుడైన యువరాజు ప్రతాపవర్మ దేశసంచారం చేస్తూ, ఒక గ్రామ పొలిమేర చేరుకునే సరికి, అతడి కాలిలో చిన్న ముల్లు దిగి రక్తం కారసాగింది. ప్రతాపవర్మ అక్కడే చతికిల బడిపోయి, వెంటనే ఏం చేయాలో తెలియక దిక్కులు చూడసాగాడు.

ఆ సమయంలో సుహాసిని అనే ఒక రైతు కూతురు, ఊరు చివరనున్న చెట్ల నుంచి గోరింటాకు కోసుకుందామని అక్కడికి వచ్చింది. ఆమె, ప్రతాపవర్మ అవస్థ చూసి జాలిపడి, అతణ్ణి సమీపించి, దాపుల్లో వున్న మరొక ముల్లు తీసుకుని, అతడి కాలిలోని ముల్లును బయిటికి తీసింది. తరవాత దగ్గిర్లో వున్న ఏదో చెట్టు ఆకుపసరు గాయానికి పూసి, తన చీర చెరగు చింపి కట్టుకట్టింది.

ప్రతాపవర్మ కృతజ్ఞతతో, "నువ్వు, నాకు చేసిన సాయం మరువలేనిది. నీకేం కావాలో చెప్పు, యిస్తాను," అన్నాడు.

సుహాసిని పరిహాసంగా నవ్వి, "ముందు నీ కాలిలో, గుచ్చుకునే ముళ్ళు, నీవే తీసుకోవడం నేర్చుకో. తరవాత నా సంగతి ఆలోచిద్దువుగాని," అన్నది.

ప్రతాపవర్మ చిరునవ్వుతో, "అలా నేర్చుకోవలసిన అవసరం, నాకింతవరకూ కలగలేదు. ఎప్పుడూ ఎవరో ఒకరు నాకు సేవలు చేస్తూండేవారు. పోనీ, యిప్పుడైనా నేర్చుకుందామనుకుంటే, సమయానికి నువ్వు వచ్చావు," అన్నాడు.

"ఈ దేశపురాజులా కబుర్లు చెబుతున్నావు! నన్ని దేశానికి రాణిని చెయ్యగలవా?" అన్నది సుహాసిని.

జొన్నలగడ్డ రామలక్ష్మి



అ ప్రశ్న వింటూనే ప్రతాపవర్మ సుహాసిని కేసి తేరిపార చూశాడు. ఆమె అందం అతణ్ణి దిగ్భ్రాంతుణ్ణి చేసింది. అతడు నెమ్మదిగా, "ఈ దేశానికి రాణివి కావాలన్న కోరిక నీకుంటే, అడగవలసిన వాడినే అడిగావు. నేనీ దేశానికి కాబోయే రాజును; నా పేరు ప్రతాపవర్మ. దేశ సంచారం చేస్తూ యిలా వచ్చాను. ఇంత వరకూ నిన్ను మించిన సుందరి, నా కళ్ళ బడకపోవడం నీ అదృష్టం. నిన్ను తప్పక నా రాణిగా చేసుకుంటాను," అన్నాడు.

అ మాటలకు సుహాసిని ఏమాత్రం చలించక, "అందమైన ఆడపిల్లను చూడగానే, కొందరికి అబద్ధాలు చెప్పాలని బుద్ధి పుడుతుంది. నువ్వే నిజంగా రాజువైతే, నేనా విషయం తెలుసుకోగలను," అన్నది.

"ఎలా తెలుసుకోగలవు ?" అని అడిగాడు ప్రతాపవర్మ.

"నువ్వే నిజంగా రాజువైవుండి, నన్ను వివాహమాడదలిస్తే, మన దేశంలో సూర్యుడు పడమటి దిక్కున ఉదయించేలా చేయాలి. గంగానదిని మన దేశంలో ప్రవహింపచేయాలి," అన్నది సుహాసిని.

సుహాసిని మాటలకు ప్రతాపవర్మ తెల్లబోయి, "ఇది ఎవరివల్లా సాధ్యపడదు. నువ్వు పరిహాసమాడుతున్నావు." అన్నాడు.

"నేను పరిహాసమాడడం లేదు. అధికారంలో వున్నవాడికి ఏదైనా సాధ్యపడుతుంది!" అన్నది సుహాసిని.

ప్రతాపవర్మ కొంచెం సేపు ఆలోచించి, "సరే, నాకొక మాసం రోజులు గడువియ్యి. నువ్వన్నది సాధిస్తాను," అన్నాడు.

సుహాసిని అందుకు ఒప్పుకున్నది. ప్రతాపవర్మ రాజధానికి తిరిగి వెళ్ళి, మంత్రులందరినీ పిలిచి, "సూర్యుడు పడమటి దిక్కున ఉదయించాలి. గంగానది మన దేశంలో ప్రవహించాలి. ఇందుకు ఏం చేయాలో చెప్పండి," అని అడిగాడు.

ఇది విని మంత్రులందరూ ఆశ్చర్యపోయి, "యువరాజా! దేశసంచారంలో ఎక్కడైనా మీరు వెర్రిపుచ్చకాయలాంటిది తినడం జరగలేదు కదా! కాలగతిని మార్చడం ఎవరికి సాధ్యం? ఎక్కడో వున్నగంగానదిని, మన దేశానికెలా తీసుకురాగలం? రెండూ అసాధ్యాలే!" అన్నారు.

"అలాంటప్పుడు రాజుగా నా అధికారానికి విలువా, అర్థాలే వుండవు. నేనీ రాజ్యభారాన్ని స్వీకరించను. సామాన్య పౌరుడిలా హాయిగా జీవిస్తాను," అన్నాడు ప్రతాపవర్మ.

ఇది విన్న మహారాజు, ప్రతాపవర్మను కలుసుకుని, "నీవడుగుతున్నవి, అసాధ్యాలు. నీకు రాజ్యభారం స్వీకరించడం యిష్టం లేక, యీ ఎత్తువేశావని, నాకను మానంగా వున్నది," అన్నాడు.

అప్పుడు ప్రతాపవర్మ తండ్రికి సుహాసిని కథంతా చెప్పాడు.

మహారాజు అమితాశ్చర్యంగా, "మూర్ఖురాలైన ఒక పల్లెటూరిపిల్ల మాట పట్టుకుని, నీవీ నిర్ణయానికి రావడం, ఏమీ బాగా లేదు," అన్నాడు.

"ఆమె మూర్ఖురాలు కాదు; చాలా తెలివైనది," అన్నాడు ప్రతాపవర్మ.

"అదీ చూద్దాం!" అని మహారాజు వెంటనే భటులను పంపి, సగౌరవంగా సుహాసినిని అంతఃపురానికి రప్పించాడు.

ప్రతాపవర్మ నిజంగానే యువరాజని తెలియగానే, సుహాసిని ఆశ్చర్యపోయి,





''నేనిప్పుడు యువరాజునేగాని, యీ దేశానికి రాజును కాదు. ఇష్టమైతే నువ్వడిగే అధికారం ఏదో, మా నాన్న గారు యివ్వాలి,'' అన్నాడు ప్రతాపవర్మ.

మహారాజు యీ విషయమై చాలాసేపు ఆలోచించాడు. సుహాసిని తెలివైనదిగా ఆయనకు తోచింది. ఆమెకు అధికారం యివ్వాలంటే, ఆమెను రాణిని చేయాలి. రాణిని చేశాక ఆమెను శిక్షించడం సాధ్య పడదు!

ఇలా కొంతసేపు ఆలోచించగా రాజుకు ఒక ఉపాయం తోచింది. ఆయన సుహాసి నితో, ''సరే, ఈ రోజు నుంచీ, నువ్వే దేశానికి రాణివి. కాని, ప్రతాపవర్మ సైన్యాధికారిగా వుంటాడు. నువ్వు రాజ ద్రోహం తలపెట్టితే, పదవి నుంచి తొల గించబడతావు. నువ్వన్నది ఋజువు చేశాకే నీకూ, ప్రతాపవర్మకూ వివాహం జరుగుతుంది. అయితే, యిందుకు గడువు నీకు మాసం రోజులు మాత్రమే!'' అన్నాడు.

సుహాసిని యీ నియమాలకు ఒప్పుకు న్నది. ఆమె దేశానికి రాణీగా ప్రకటించ బడింది. పాలనా వ్యవహారాల్లో జోక్యం కలుగుజేసుకోకుండా మహారాజు అంతః పురంలోనే వుండిపోయాడు. ప్రతాపవర్మ సైన్యాన్ని తన ఆధీనంలో వుంచుకున్నాడు.

''నిజం తెలియక ఏమేమో అన్నాను. నా తప్పు మన్నించండి,'' అన్నది.

అందుకు ప్రతాపవర్మ, ''నీ తప్పు అంత సులభంగా మన్నించబడేదికాదు. నువ్వు కోరిన కోర్కెలు నేను సాధించలేక పోయాను. అయినా అవి సాధ్యాలే అని ఋజువు చేయవలసినదానివి నువ్వు. అలా కానప్పుడు నీకు కఠినమైన శిక్ష తప్పదు,'' అన్నాడు.

సుహాసిని యీ మాటలకు ఏమాత్రం భయపడక, ''నేనన్నది సాధ్యమేనని తప్పకుండా ఋజువు చేయగలను. అయితే, అందుకు నాకు అధికారం కావాలి,'' అన్నది సంతోషంగా.

సుహాసిని రాణి అవుతూనే పాలనా వ్యవహారాల్లో అనవసరపు ఖర్చులు తగ్గించి, అందువల్ల మిగిలే ధనం మేరకు ప్రజలపై పన్నులు రద్దు చేసింది. ప్రజలకు ఉపకరించే యిలాంటి మరి కొన్ని పనుల ద్వారా, ఆమె వారం తిరక్కుండానే, ప్రజల గౌరవాభిమానాలకు పాత్రురాలయింది.



ఆమె తాను రాణీ అయిన యిరవై రోజులకు మహారాజునూ, ప్రతాపవర్మనూ కలుసుకుని, "ఈ రోజు నాతో నగర సంచారానికి రండి. నేను సాధించినదేమిటో స్వయంగా చూడవచ్చు." అన్నది.

ముగ్గురూ మారు వేషాల్లో నగర సంచారానికి వెళ్ళారు. ఆ సమయంలో సూర్యోదయమవుతున్నది. సుహాసిని దారిన పోతున్న ఒక పౌరుణ్ణి పిలిచి, "అదేం దిక్కు?" అని అడిగింది.

"పడమర!" అని చెప్పాడు వాడు.

మహారాజుకూ, ప్రతాపవర్మకూ కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. వాళ్ళు మరికొందరు పౌరులను ఆ ప్రశ్న అడిగి చూశారు. అందరూ సూర్యుడుదయిస్తున్న దిక్కు పడమర అని చెప్పారు.

తరవాత ముగ్గురూ నగరమధ్యంలో ప్రవహిస్తున్న తారానది దగ్గిరకు వెళ్ళారు. సుహాసిని అక్కడ కనిపించిన పౌరుడొకణ్ణి, "ఈ నది పేరేమిటి?" అని అడిగింది.

"గంగానది!" అన్నాడు వాడు.

ఆ పౌరుడే కాక, ఎవరినడిగినా మహారాజుకూ, యువరాజుకూ యిదే సమాధానం వచ్చింది.

అప్పుడు సుహాసిని తలవంచి వినయంగా, "ప్రభూ, నేను కోరిన కోర్కెలు సాధ్యమే అని ఋజువు చేశాను," అన్నది మహారాజుతో.

"ఇది చాలా వింతగా వున్నది. సూర్యుడు ఎప్పటిలాగే తూర్పున ఉదయిస్తున్నాడు. కానీ, పౌరులందరూ

ఆ దిక్కును పడమర అంటున్నారు. నగరంలో ప్రవహించే తారానదిని గంగా నది అంటున్నారు. ఇది ఎలా సాధించావు ?'' అని అడిగాడు మహారాజు.

'' మహాప్రభూ ! నేను కొంత కాలంగా ఏ విధమయిన పరిపాలనా పద్ధతుల ద్వారా, ప్రజలు సుఖసౌఖ్యాలతో జీవించగలరనే విషయం గురించి ఆలోచిస్తున్నాను. అంతఃపురంలో కాక, పల్లె పట్టున పుట్టి పెరిగిన దాన్ని కావడం వల్ల, ప్రజల యిక్కట్లు నాకు బాగా తెలుసు. రాణిని కాగానే, ఆ అవకాశం ఉపయోగించుకుని ప్రజలకు మేలు కూర్చే కొన్ని సంస్కరణలు ప్రవేశ పెట్టాను. వెంటనే ప్రజలకు నేనంటే కలిగిన ఆదరం, రెండు వారాలు తిరక్కుండానే ఆరాధనగా మారింది. ఇది అవకాశంగా తీసుకుని, 'మీ రాణి ఆరోగ్యం దెబ్బ తిన్నది. ఆమెకు త్వరలో ఆరోగ్యం కలగాలంటే, అందరూ తూర్పు దిక్కును పడమర అని పిలవాలి. నగరంలో ప్రవహించే తారా నదిని గంగా నది అని పిలవాలి,' అని రాజోద్యోగుల చేత ప్రచారం చేయించాను," అన్నది సుహాసిని.

ప్రతాపవర్మ చప్పట్లుచరిచి, ''ఆహా, ఇదింత సులభమని నాకు తోచనేలేదు,'' అన్నాడు.

మహారాజు మాత్రం గంభీరంగా, ''నేను, నిన్ను కోడలిగా స్వీకరిస్తున్నాను. ఇందుకు కారణం, నీ తెలివితేటలూ కాదు; నా మాట నిలబెట్టుకోవాలన్న తాపత్రయమూ కాదు. కొద్ది రోజుల్లోనే నువ్వు ప్రజలకు ఆరాధ్యదేవతవయ్యావు. నీవంటి మహారాణి, నా దేశప్రజలకు ఎంతయినా అవసరం. నిన్ని దేశానికి రాణిని చేసి, నేనూ, నా ప్రజల మెప్పు పొందాలనుకుంటున్నాను,'' అన్నాడు.

తరవాత కొద్ది రోజులకే ప్రతాపవర్మకూ, సుహాసినికీ వైభవంగా వివాహం జరిగింది. ప్రతాపవర్మ రాజైనప్పటికీ, వాస్తవానికి అతడు సైన్యాధికారిగానే వుంటూ, పరిపాలనా బాధ్యతలన్నీ సుహాసినికే అప్పగించి, మంచిరాజుగా పేరుతెచ్చుకున్నాడు.





# పొట్టివాడు

పుష్కరద్వీపం, క్రౌంచద్వీపం ఇరుగు పొరుగులు. క్రౌంచద్వీపపు రాజుకు అన్ని దేశాల రాజులూ మిత్రులయ్యారు గాని పుష్కరద్వీప రాజు మాత్రం కొరకరాని కొయ్యగా ఉండిపోయాడు. అతన్ని బుట్టలో వేసుకోవటం ఎలాగా అని ఆలోచనలో పడ్డాడు క్రౌంచద్వీపపు ప్రభువు.

ఈ పని నిర్వహించటానికి సమర్థుడు ఎవరా అని ఆలోచించి, చివరకు మహా మంత్రి అయిన దూరదర్శిని పుష్కర ద్వీపానికి రాయబారిగా పంపాడు.

పుష్కరద్వీప రాజుకు తను మహా తెలివితేటలు గలవాణ్ణి అని విపరీతమైన గర్వం, అహంభావమున్నూ. అందుచేత, ఆ వచ్చిన దూరదర్శిని హడలగొట్టి సాగనంపాలని అనుకొన్నాడు.

దూరదర్శి కోట సింహద్వారం దగ్గరకు రాగానే, భటులు తలుపులు మూసివేశారు. సింహాసనం మీద ఠీవిగా కూర్చొని ఇదంతా చూస్తున్నాడు మహారాజు.

రాజును చూడగానే, దూరదర్శి క్రింద నుంచే వందనం చేశాడు. రాజు వెకిలిగా నవ్వుతూ, "ఏయ్ మంత్రీ! అదిగో ఆ పెద్ద తలుపులకు పక్కగా కుక్కలు ప్రవేశించే కంత ఉన్నది. అందులోనించి దూరి రా పైకి" అన్నాడు, సింహాసనంలో కూర్చొనే. చుట్టూ వున్న పరివారమంతా "భలే-భలే" అన్నారు.

అప్పుడు మహామంత్రి "చిత్తం, ప్రభూ! మీది ఎవళ్ళకు సంబంధించిన దేశమైతే వాళ్ళందరూ పోయే ద్వారాన్నే పోతాం. మనుష్యుల దేశమైతే వాళ్ళ వాకిలిగుండా వెళ్తాం. మీది కుక్కల రాజ్యం అయితే ఆ ద్వారంగుండా రావటానికి నాకేం అభ్యంతరం లేదు" అని చల్లగా అనే సరికి రాజు ముఖం తెల్లబడింది.

25 ఏళ్ళనాటి చందమామ కథ

'' అరే, తప్పించుకున్నాడే!'' అను కొని రాజు వానిని సింహద్వారా న్నే రప్పించి, కుర్చీవేయించి పక్కన కూర్చో పెట్టుకొన్నాడు.

చూస్తే దూరదర్శి చాలా పొట్టివాడు. ఆ కుర్చీలో సగానికైనా రాలేదు. మళ్ళీ అవమానించాలని మనసు పుట్టి, '' మంత్రీ, మీ బుద్ధులకుమల్లేనే మీ రాజ్యంలో మనుషులూ పొట్టివాళ్ళేనా?'' అన్నాడు రాజు.

వెంటనే మంత్రి '' రాజా! మా దేశంలో రకరకాల మనుషులున్నారు. మరి, మా రాజ్యంలో యింకొక నియమం కూడా ఉంది. అల్పుల దగ్గరకు పొట్టి వాళ్ళనీ, గొప్పవాళ్ళ దగ్గరకి పొడుగు వాళ్ళనీ పంపాలనేది మా దేశాచారం. అందుకనే నన్నిక్కడికి పంపారు '' అన గానే రాజుపని మతాబా కాల్చినట్టయింది.

'' వీడి తస్సాదియ్యా!'' అనుకొని, అతనికి ఎలా తలవంపు కలిగించటమా అని ఆలోచించసాగాడు రాజు.

ఇంతలో కొందరు భటులు ఒక ఖైదీని పట్టుకువచ్చి వీడు పుష్కరద్వీపపు వాడనీ, దొంగతనం చేశాడనీ ఫిర్యాదు చేశారు. '' ఏమయ్యా మంత్రీ. మీ రాజ్యంలో వాళ్ళందరూ చోరులేనా ఏమిటి?'' అన్నాడు రాజుగారు హేళనగా.

మంత్రి మాత్రం తక్కువవాడా? '' అది కాదు మహారాజా! అది గడ్డ తీరు. ఏ గడ్డ మీద ప్రవేశిస్తే ఆ బుద్ధులే పుడ తాయి. మీ రాజ్యంలో మా వాడికి దొంగ తనం అబ్బింది గాని మా దేశంలో దొంగ తనమనేదే లేదు!'' అన్నాడు మహామంత్రి.

దెబ్బతో రాజుగారికి నసాళాని కంటింది. '' ఈ పుష్కరద్వీపపు వాళ్ళతో కయ్యం పెట్టుకు నెగ్గలేము,'' అనుకొన్నాడు. అప్పుడు మంత్రిని బహుమతి కోరు కొమ్మనేసరికి ''రెండు రాజ్యాలూ మైత్రిగా ఉండడమే నాకు కావలసిం''దన్నాడు దూరదర్శి.

అది మొదలు రెండు రాజ్యాలూ స్నేహంగా ఉంటూ వచ్చాయి.





# విష్ణు కథ

కృత, త్రేతా యుగాల తర్వాత ద్వాపర యుగంలో రాక్షసులు విపరీతంగా మనుషులై పుట్టి, భూమికి బరువయ్యారు. భూదేవి విష్ణువుతో మొరపెట్టింది.

విష్ణువు, ''దేవీ! కృష్ణావతారం ఎత్తి, నీ ఆర్తి తొలగిస్తాను!'' అని అభయమిచ్చాడు.

ఆదికాలం నుంచీ విష్ణువుకు ప్రబల శత్రువైన కాలనేమి రాక్షసుడు కంసుడుగా పుట్టి, మధురానగరాన్ని పాలించే ఉగ్రసేనుడి కుమారుడనిపించుకున్నాడు.

దేవాసుర యుద్ధంలో, దానవ నాయకుడై విష్ణువుతో పోరాడిన విప్రచిత్తి, మగధ రాజ్యాన్నేలే జరాసంధుడై, రాజులను తెచ్చి భైరవుడికి బలులిచ్చి అతి శ్రద్ధగా అర్చిస్తున్నాడు. కంసుడు జరాసంధుడి అల్లుడు.

ఉగ్రసేనుడి తమ్ముడి కుమార్తె దేవకికి, యదువంశ రాజైన వసుదేవుడితో వివాహం జరిగింది. కంసుడు వారిని రథం మీద తీసుకుపోతూండగా, ఆకాశవాణి—దేవకి ఎనిమిదో సంతానంవల్ల కంసుడు చంపబడతాడు—అని పలికింది.

కంసుడు దేవకిని చంపబడకుండా వసుదేవుడు అడ్డుపడి, ఆమె ప్రసవించే బిడ్డల్ని అప్పగిస్తానని కంసుడికి యిచ్చిన మాట తప్పకుండా, ఆరుగుర్ని అప్పగించాడు.

దేవకి ఏడవ గర్భాన విష్ణువు అంశతో ఆదిశేషుడు పడ్డాడు. ఆ పిండాన్ని గోకు

16. కృష్ణావతారం



లంలో ఉన్న వసుదేవుడి మరొక భార్యయైన రోహిణి గర్భాన చేర్చి, పిమ్మట నందగోపుడి భార్య యశోదకు కూతురుగా పుట్టమని యోగ మాయాదేవిని విష్ణువు ఆదేశించాడు.

దేవకి ఏడవ గర్భం ప్రసవం రాకుండా అణగారిపోయింది. తర్వాత దేవకి ఎనిమిదోసారి గర్భం ధరించిన వెంటనే, దేవకీ వసుదేవుల్ని కంసుడు కారాగారంలో పెట్టాడు.

అది శ్రావణ మాసం. కృష్ణపక్షం. అష్టమి ప్రవేశించింది. చంద్రుడు రోహిణీ నక్షత్రంతో ఉన్నాడు. నడి రాత్రి. కావలి భటులకు చావునిద్ర ముంచుకొచ్చింది.

దేవకి ప్రసవించింది. విష్ణువు కృష్ణుడుగా అవతరించాడు. చెరసాల తలుపులు తెరుచుకున్నాయి.

విష్ణువు ఆదేశంతో వసుదేవుడు బిడ్డడిని యమునానదిని దాటించి, అదే సమయంలో గోకులంలో అందర్నీ మాయనిద్ర ఆవహించగా, ఆ నిద్రలోనే ఆడపిల్లను ప్రసవించిన యశోద పక్కలో పిల్లవాణ్ణి ఉంచి, ప్రాణం లేనట్లున్న పిల్లను సంగ్రహించుకొని వెళ్ళాడు.

చెరసాల చేరగానే దిక్కులు పిక్కటిల్లేలాగ ఆ శిశువు క్యారుమని గగ్గోలు చేసింది.

కంసుడు శిశువును వధ్యశిలపై కొట్టి చంపబోగా పైకెగసి, పకపక నవ్వుతూ, ''ఓరి, కంసా! నిన్ను చంపేవాడు క్షేమంగా ఉన్నాడులే!'' అని చెపుతూ, దుర్గాదేవిగా కనిపించి అంతర్థానమైంది.

కంసుడు భయంతో, ఆగ్రహంతో దేవకీ వసుదేవుల ఎదుట వారి ఆరుగురి బిడ్డల్ని తెగటార్చాడు.

గోకులంలో కృష్ణుడు పుట్టినందుకు కృష్ణాష్టమి, గోకులాష్టమిగా వేడుకలు జరిగాయి. అంతకుముందే కృష్ణుడికి అన్నగా రోహిణికి బలరాముడు పుట్టాడు.

నారదుడు కంసుడి దగ్గిరికి వచ్చి, ''కంసా! నువ్వు ఉగ్రసేనుడి కుమా

రుడివి కావు; కాలనేమివి! నిన్ను చంపాలని పుట్టిన ఆ విష్ణువు ఎక్కడో ఉన్నాడని వింటివి గదా? నీ పిలుపు కోసం రాక్షసులు ఎదురు చూస్తున్నారు!" అని హెచ్చరించి వెళ్ళాడు.

ఉగ్రసేనుడితో వివాహమై, విరహంతో ఉన్న ఉగ్రసేనుడి రాణిని ఒక రాక్షసుడు ఉగ్రసేనుడి రూపంతో వెళ్ళి మోసపుచ్చినప్పుడు, కాలనేమి ఆమె గర్భం ప్రవేశించి కంసుడుగా పుట్టాడు.

కంసుడు ఉగ్రసేనుడిని కారాగారంలో వేయించి సింహాసనం ఆక్రమించాడు. రాక్షసులందర్నీ చేరదీసుకున్నాడు. పసివాళ్ళను చంపమని పూతన రక్కసిని పంపాడు. ఊరూరా పసిపాపల్ని చంపుతూ, మానవకాంత రూపంతో వెళ్ళి పాలీయవచ్చిన దాని ప్రాణాలు పీల్చి చంపాడు కృష్ణుడు.

సుడిగాలిలా ఆకాశానికి ఎత్తుకుపోయిన తృణావర్తుడినీ, బండిగా విరుచుకు పడాలని చూసిన శకటాసురుడినీ చిన్నారి కృష్ణుడు చంపాడు.

యశోద కృష్ణుణ్ణి తను కన్న ముద్దుల పట్టిగా అల్లారు ముద్దుగా చూసుకొని మురిసిపోతూన్నది.

బాలకృష్ణుడు అల్లరివాడై చిలిపి పనులతో ఇంటింట వెన్నలు దొంగిలించాడు.



అనేక అద్భుత లీలలు చేశాడు. కృష్ణ లీలలతో గోకులం ఆనందతరంగాలతేలింది.

యశోద కృష్ణుణ్ణి రోలుకి కట్టితే, యీడ్చుకు వెళ్ళి రెండు మహావృక్షాల నడుమ నుంచి లాగాడు. వృక్షాలు కూకటి వ్రేళ్ళతో కూలి గంధర్వులు శాపవిముక్తి పొందారు.

మన్ను తిన్నాడని నోరు చూపమనగా అవులించి యశోదకు విశ్వరూపం చూపించాడు.

కాళీయ మహాసర్పం పడగల మీద తాండవం చేసి మర్దించాడు.

గోకులంలోని వారంతా బృందావనానికి వలసపోయినప్పుడు, గోవర్ధన పర్వతాన్ని



పూజించినందుకు దేవేంద్రుడు అలిగి పిడుగుల జడివాన కురిపించగా, వ్రేలితో గోవర్ధనగిరిని ఎత్తి గొడుగుపట్టి గోవులనూ, గోపజనాన్నీ కాపాడి ఇంద్రుడి గర్వ భంగం చేశాడు.

వేణుగోపాలుడై ఆలమందలను కాచాడు. మురళీ గానంతో గోవుల్ని, గోపికల్ని, బృందావనాన్ని పరవశింపజేశాడు.

మారు రూపాలతో వచ్చిన అనేకమంది రాక్షసుల్ని హతమార్చాడు. బలరాముడు కొందర్ని తుదముట్టించాడు.

కృష్ణ బలరాముల్ని చంపడానికి కంసుడు ధనుర్యాగం మిషతో మధురా నగరానికి రప్పించాడు. చంపాలని పన్నిన పన్నాగాలన్నిటినీ బాలయదువీరులు చిత్తు చేశారు.

కృష్ణుడు కంసుణ్ణి గద్దె నుండి జుట్టు పట్టి యీడ్చి ముష్టిఘాతంతో చంపాడు.

దేవకీ వసుదేవుల్ని, ఉగ్రసేనుణ్ణి సంకెళ్ళ నుండి విడిపించి ఉగ్రసేనుడిని సింహాసనంపై నిలిపాడు.

కృష్ణ బలరాములు యువకులై యదు వంశ నాయకులయ్యారు.

తన కుమార్తెలైన అస్తి, ప్రాస్తిలను విధవలుగా చేసినందుకు జరాసంధుడు కృష్ణుడిపై పగబట్టాడు. ఇరవైమూడు అక్షౌహిణుల సైన్యంతో మధురను ముట్టడించాడు.

కృష్ణుడు జరాసంధుడిని ఓడించి ప్రాణాలతో విడిచి తరిమికొట్టాడు.

యవనమ్లేచ్ఛులకు రాజైన కాలయవన రాక్షసుడిని జరాసంధుడు కృష్ణుడి మీదకు ఉసిగొల్పాడు.

కృష్ణుడు కాలయవనుడికి దొరక్కుండా పరుగెత్తి ముచికుందుడు నిద్రిస్తున్న గుహలో జొరబడి దాక్కున్నాడు.

ముచికుందుడు ఇక్ష్వాకుల నాటి మాంధాత కుమారుడైన గొప్ప రాజు. యుద్ధాల్లో దేవతలకు గొప్ప సహాయం చేశాడు. దేవతలు వరం కోరుకోమనగా మోక్షాన్ని కోరాడు. ద్వాపరయుగంలో



కృష్ణుడి దర్శనం అనంతరం సిద్ధిస్తుందని దేవతలు చెప్పగా అంతవరకు నిద్రను, నిద్రాభంగం చేసినవారు తను చూడగానే భస్మం కావలెనని కోరుకున్నాడు.

కాలయవనుడు ముచికుందుణ్ణి కృష్ణుడనుకొని తన్నాడు. నిద్రాభంగమై ముచికుందుడు తీక్ష్ణంగా చూసేసరికి కాలయవనుడు బూడిద అయ్యాడు.

కృష్ణుడు ముచికుందుడికి దర్శనమిచ్చి, బదరికాశ్రమం చేరుకొని తపస్సు చేశాక మోక్షం సిద్ధిస్తుందని చెప్పాడు.

జయ, విజయులు వారి మూడో జన్మగా కృష్ణుని శత్రువులుగా శిశుపాలుడు, దంతవక్త్రుడుగా పుట్టారు.

చేదిదేశానికి రాజైన దమఘోషుడికి కుమారుడుగా శిశుపాలుడు నాలుగు చేతులతో, మూడు కన్నులతో పుట్టాడు. ఎవరు ఎత్తుకున్నప్పుడు మూడో కన్ను, రెండు చేతులు మాయమవుతాయో అతని చేతనే చంపబడతాడని ఆకాశవాణి చెప్పింది. శిశుపాలుడి తల్లి సాత్వతి వచ్చిన వారందరికీ పిల్లవాణ్ణి ఎత్తుకోమని యిస్తుండేది. కృష్ణ బలరాములకు సాత్వతి అత్త అవుతుంది. వారికీ యిచ్చింది. కృష్ణుడు ఎత్తుకోగానే పిల్లవాడు సాధారణ రూపుడయ్యాడు.

శిశుపాలుడిని నూరు తప్పుల వరకు విడిచి పుచ్చమని సాత్వతి అర్థించింది. కృష్ణుడు అలాగేనని ఆమెకు మాట యిచ్చాడు.

శిశుపాలుడు రాజై జరాసంధుడితో చేరి అత్యాచారాలూ, అపరాధాలూ చేస్తూ వచ్చాడు, అతడికి తమ్ముడు దంతవక్త్రుడు తోడైనాడు.

జరాసంధుడు మాటిమాటికీ మధురా నగరంపై దాడి చేస్తూంటే కృష్ణుడు పలుమార్లు ఓడించి, తరిమికొట్టి, దుర్మార్గులైన రాజులెందర్నో కడతేర్చాడు.

కృష్ణుడు సముద్రుణ్ణి చోటు అడిగి సముద్ర మధ్యంలో విశ్వకర్మచేత సురక్షితమైన ద్వారకానగరాన్ని వైభవోపేతంగా

నిర్మింపజేసి తనవారినందరినీ ద్వారకకు తరలించాడు.

జరాసంధుడు చివరిసారిగా శిశుపాలుడు, దంతవక్త్రుడు, పౌండ్రకుడు, సాళ్వుడు మొదలైన తన అనుయాయులైన రాజులందర్నీ కూడగట్టుకొని మధురను ముట్టడించాడు.

అంతకుముందే యాదవుల్నీ, మధురా ప్రజనూ, ద్వారకకు పంపించిన కృష్ణ బలరాములు ప్రవర్షణగిరికి చేరుకొని శిఖరాగ్రాన్ని అధిరోహించారు.

జరాసంధాదులు ప్రవర్షణగిరి చుట్టూరా మంటలుపెట్టి గిరిని కాల్చారు. కృష్ణ బలరాములు ఆకాశమార్గాన ద్వారకకు సురక్షితంగా చేరుకున్నారు.

జరాసంధుడూ, శిశుపాలుడూ కృష్ణ బలరాములు దగ్ధమై ఉంటారని పొంగిపోతూ వెళ్తుంటే, ద్వారక నుండి కృష్ణుడు పూరించిన శంఖధ్వని విని తెల్లముఖాలతో ఒకర్నొకరు చూసుకున్నారు.

శిశుపాలుడు అక్కసుకొద్దీ మధురా నగరాన్ని నిప్పుపెట్టి కాల్చాడు.

జరాసందుడు నౌకల మీద ద్వారకను ముట్టడించాలని సైన్యాలను పంపాడు. పెనుతుఫానులో చిక్కుకొని నౌకలన్నీ మునిగిపోయాయి. జరాసంధుడు యీ వలి సముద్రం ఒడ్డున కెరటాల విజృంభణ



చూస్తూండగా, "తాతా!" అన్న కృష్ణుడి పిలుపు, పకపక నవ్వు వినిపించింది.

సముద్ర మధ్యంలో ఒక గుట్ట మీద నిల్చుని నవ్వుతున్న కృష్ణుడు కనిపించాడు.

"జరాసంధా! ఇప్పుడు నువ్వేమీ చేయలేవు. ద్వారకకు సముద్రుడు నిన్ను చేరనివ్వడు. నీకు నా చేతిలో చచ్చే అదృష్టం లేదు. నీ సమ బలుడైన వాడిచేత చస్తావు. కొంతకాలం గతించాక మళ్లీ పునర్దర్శనం, వెళ్ళు!" అన్నాడు కృష్ణుడు.

విదర్భ రాజైన భీష్మకుడికి కుమార్తెగా లక్ష్మి రుక్మిణిగా పుట్టింది. బాల్యప్రాయం నుంచీ కృష్ణుడే తన నాథుడని చెప్పు

కొనేది. అటువంటి రుక్మిణిని, రుక్మిణి అన్న రుక్మి కృష్ణుని శత్రువర్గంలో చేరి చెల్లెలికి శిశుపాలుడితో వివాహం చెయ్య డానికి సర్వసన్నాహాలు చేశాడు.

ఆ వివాహం తప్పించి తన్ను చేపట్టి రక్షించమని రుక్మిణి కృష్ణుడికి కబురు పంపింది.

పెళ్ళికి ముందు రుక్మిణి దుర్గను పూజించి, ఆలయం నుంచి వస్తూండగా, కృష్ణుడు రుక్మిణి చేయిపట్టి నాలుగు గుర్రాలు పూన్చిన తన రథం మీదకు ఎక్కించుకొన్నాడు. రుక్మి, శిశుపాల జరా సంధాదులు ఎదుర్కొన్నారు.

బలరాముడు యాదవ వీరులతో వెనుకనే వచ్చి తమ్ముడితో కలిశాడు.

కృష్ణుడు శిశుపాలుణ్ణి తరిమికొట్టాడు. బలరాముడు జరాసంధుడ్ని ఓడించి తరి మాడు. శత్రు రాజులందర్నీ కృష్ణ బల రాములు చిందర వందర చేశారు.

కృష్ణుడు విజయశంఖం పూరించి రుక్మిణిని రథం మీద ఎత్తుకుపోతూంటే వెంటతలపడిన రుక్మిని ఓడించి జుట్టు, మీసమూ గొరిగి పరాభవించి విడిచి పెట్టాడు. రుక్మి తలెత్తుకొని మరెప్పుడూ కృష్ణుడి జోలికి పోలేదు.

క్షత్రియ వీరుడికి తగిన రాక్షస వివాహంగా ఎత్తుకు వచ్చిన రుక్మిణీ కళ్యాణం కృష్ణుడితో ద్వారకలో ఎంతో వైభవంగా జరిగింది.

తరువాత కృష్ణుడు నీలాపనింద తొలగించుకోడానికి అరణ్యం పట్టి, గుహలో జాంబవంతుడితో యుద్ధంచేసి, శ్యమంతక మణిని తెచ్చి, సత్రాజిత్తుడికి యిచ్చి, భూదేవి అంశగల అతని కుమార్తె సత్యభామను వివాహం చేసుకొన్నాడు. తరువాత జాంబవతిని, మిత్రవింద, కాళింది, లక్షణ, భద్ర, నాగ్నజితిని వివాహం చేసుకొని అష్ట మహిషులతో అష్ట సిద్ధులు గల యోగపురుషుడిలాగ, అష్ట ఐశ్వర్యాలతో తులతూగుతూ, ద్వారక రాజధానిగా యాదవులకు ప్రధాన నాయకుడై వెలుగొందుతున్నాడు.





# సుల్తాను-నౌకరు

ఎమెన్ దేశంలోని సానానగరాన్ని పాలించే సుల్తాన్ ముబారక్ యువకుడు. అతడిది చాలా దుందుడుకు స్వభావం. ఎవరైనా నేరం చేశారన్న అనుమానం కలగగానే, నిజానిజాలు తెలుసుకునేందుకు ప్రయత్నించకుండానే, వాళ్ళను కఠినంగా శిక్షించేవాడు.

ఒకనాడు అతను అరణ్యానికి వేటకు వెళ్ళాడు. వెంట కొందరు భటులతో పాటు, నౌకరు సలీం కూడా వున్నాడు. వాళ్ళకు ఒకచోట లేడి ఒకటి కంటబడింది. ముబారక్ దాన్ని బాణంతో కొట్టాలని ప్రయత్నించాడు గాని, అది తప్పించుకుపోయింది.

సుల్తాన్ దాన్ని చుట్టుముట్టమని పరివారానికి ఆజ్ఞ యిచ్చాడు. వాళ్ళు చెట్లలో దాన్ని వెతుకుతూపోయి, ఒకచోట అది కనబడగానే, దాన్ని సుల్తాన్ వున్నవైపుకు తరమసాగారు. ఆ సమయంలో నౌకరు సలీం వదిలిన బాణం గురి తప్పి, లేడి కేసి వస్తున్న సుల్తాన్ ఎడమ చెవికి తగిలి, చెవిలో పెద్ద రంధ్రమయింది.

ముబారక్ ఉగ్రుడైపోయి, తన నౌకరు సలీం తల నరకవలసిందిగా భటులను ఆజ్ఞాపించాడు.

సలీం అతడికి మోకరిల్లి, "ప్రభూ, మీకు హాని కలిగించాలని, నేను ప్రయత్నించలేదు. నేను లేడికేసి బాణం వదిలిన సమయంలో, తమరు దానికీ, నాకూ మధ్యగా పరిగెత్తుకు వచ్చారు. నన్ను కరుణించండి. మీరేదైనా ఆపదలో వున్న సమయంలో దేవుడు తప్పక మిమ్ము కరుణించగలడు!" అన్నాడు వినయంగా.

ఆ మాటలతో సుల్తానుకు అతడిపై జాలి కలిగి, క్షమించాడు. అందరూ నగ

అరేబియా కథ



ఆ ప్రాంతాన ఎక్కడా జనసంచారం లేదు. సుల్తాన్ చెదిరిపోయిన జుట్టుతో, చిరిగిన దుస్తులతో చాలాదూరం నడిచి, చీకటి పడేవేళ, ఆ రాజ్యాన్ని పాలించే రాజుకోటను సమీపించాడు.

ఈ కొత్త రాజ్యంలో అతణ్ణి ఎరిగిన వాళ్ళెవరూ లేరు. ఇప్పుడు తానున్న దీనా వస్థలో, తాను ఫలానా దేశపు సుల్తాను నంటే, ఎవరూ నమ్మరు. ఇలాంటి ఆలో చనలతో. ముబారక్ కోటగోడ పక్కన వున్న, ఒక చిన్న రాళ్ళగుట్టకు ఆనుకుని పడుకున్నాడు.

కొంతసేపటికి అతడికి నిద్ర పట్టింది. హఠాత్తుగా ఎవరో కాలితో తన్నడంతో ముబారక్ మూలుగుతూ లేచికూర్చున్నాడు.

ఇద్దరు భటులు అతడికి కొంచెం దూరంలో వున్న ఒక శవాన్ని చూపుతూ, "అతణ్ణెందుకు హత్య చేశావు?" అని అడిగారు గద్దిస్తూ.

ముబారక్ ఆ శవంకేసి చూసి ఆశ్చర్య పడి, "నేనెవర్నీ హత్య చేయలేదు: ఆ శవాన్ని యిప్పుడేచూస్తున్నాను," అన్నాడు.

భటులు అతణ్ణి లాక్కుపోయి, తమ ప్రభువు ముందుంచారు. ఆయన ముబా రక్‌ను ఖైదులో వేయమన్నాడు.

ముబారక్, యీ దేశపు సుల్తాను తన తల నరికించనందుకు చాలా సంతో

రానికి తిరిగి వచ్చారు. ఆశ్చర్యకరమైన సంగతేమంటే, ఆ మర్నాటినుంచీ సలీం సుల్తాన్ భవనంలో కనిపించలేదు.

కొంతకాలం జరిగింది. ముబారక్‌కు సముద్రంలోని ఒకానొక దీవిపై అధి పత్యం వుండేది. అతడు సంవత్సరాని కొక సారి, ఆ దీవిని సందర్శిస్తూండేవాడు. అతడు ఓడపై, ఆ దీవికి వెళుతూండగా, పెద్ద తుఫాను రేగి పడవ నీటి అడుగున వున్న ఒక రాతిగుట్టను తాకి, ముక్క చెక్కలై పోయింది. సుల్తాను ఒక కొయ్య ఆధారంతో, ఒక పగలూ, రాత్రీ సము ద్రంలో కొట్టుకుపోయి, మరొక రాజ్య తీరంలో ఒడ్డు చేరాడు.

పించాడు. తాను ఎంతోమందికి, అంతగా విచారణ చెయ్యకుండానే శిరశ్ఛేద శిక్షలు విధించి వున్నాడు. పాపం, వాళ్ళల్లో చాలామంది నిర్దోషులై వుంటారు, అనుకున్నాడు ముబారక్.

ముబారక్ వున్న గదికి కొంచెం ఎత్తులో ఒక కిటికీ వున్నది. కాకి ఒకటి దాని పక్కన చేరి, అదే పనిగా కావుమంటూ అరవసాగింది. పట్టరాని కోపంతో అతడు, గదిలో దొరికిన ఒక రాయిని దాని మీదికి విసిరివేశాడు. రాయి కాకికైతే తగలలేదు గాని, కిటికీలోంచి రివ్వుమంటూ బయటికి పోయింది.



''ఇంకా నాలో, ఆ పాతకాలపు తొందరపాటు స్వభావం నశించలేదు!'' అనుకున్నాడు ముబారక్ విచారంగా.

ఒకటి, రెండు క్షణాలు గడిచేంతలో ఇద్దరు భటులు గది తలుపులు తెరిచి లోపలికి వస్తూనే, ముబారక్‌ను వడిసి పట్టుకుని, తెరిచి వున్న ద్వారంగుండా బయటికి విసిరివేశారు. అతడు, అక్కడ వున్న నలుగురైదుగురు యువకుల ముందు బోర్లా పడిపోయాడు.

ఆ యువకుల్లో ఆ దేశపు యువరాజు కూడా వున్నాడు. వాళ్ళు అక్కడ ఏదో ఆట ఆడుకుంటున్నారు. ముబారక్ కాకి కేసి విసిరిన రాయి, కిటికీలోంచి పోయి, యువరాజు ఎడమ చెవికి తగిలి గాయమయింది.

యువరాజు పళ్ళు కొరుకుతూ, ''ఈ నీచుణ్ణి లాక్కుపోయి, శిరశ్ఛేదం చెయ్యండి!'' అని భటులను ఆజ్ఞాపించాడు.

భటులు, ముబారక్‌ను ఈడ్చుకుపోతూండగా, యువరాజు, ''ఆగండి!'' అంటూ గట్టిగా చప్పట్లు చరిచాడు.

తరవాత అతను, ముబారక్‌ను సమీపించి, అతడి ఎడమచెవి కేసి పరీక్షగా చూస్తూ, ''చెవికి అంత పెద్ద రంధ్రం, ఏ కారణంవల్ల కలిగింది?'' అని అడిగాడు.

ముబారక్ యువరాజుకు వంగి నమస్కరిస్తూ, "ప్రభూ, నేను కాకి మీదికి విసిరిన రాయి, ప్రమాదవశాత్తూ మీ ఎడమ చెవికి తగిలినట్టే, ఒక యువకుడు లేడి మీదికి వదిలిన బాణం ప్రమాదవశాత్తూ నా ఎడమచెవికి తగిలింది." అన్నాడు.

"అలాగా! అయితే, ఆ యువకుడికి ఎలాంటి శిక్ష విధించావు?" అని అడిగాడు యువరాజు.

"ప్రభూ, అతణ్ణి శిక్షించలేదు. క్షమించి వదిలేశాను," అన్నాడు ముబారక్.

"నువ్వు కూడా ఆ యువకుడిలా క్షమించబడాలని కోరుకోవడం లేదా, సుల్తాన్ ముబారక్?" అని అడిగాడు యువరాజు.

ఆ విధంగా యువరాజు తనను పేరు పెట్టి పిలవడంతో ముబారక్ ఎక్కడ లేనంతగా ఆశ్చర్యపోయి, అతడికేసి పరీక్షగా చూశాడు. అతడెవరో కాదు, కొన్ని సంవత్సరాల కిందట తనకు నౌకరుగా వున్న సలీం! కాని, అతణ్ణి ఆ పేరుతో పిలవడానికి ముబారక్‌కు ధైర్యం చాలలేదు.

యువరాజు ముబారక్‌ను అప్యాయంగా కావిలించుకుని, "నీ ముఖకవళికలు చూస్తూంటే, నువ్వు నన్ను గుర్తించావని తెలుస్తూనే వున్నది. నేను ఒకనాటి, నీ నౌకరు కుర్రవాణ్ణే! అప్పట్లో, నా తండ్రితో కలహించి, దేశం వదిలి, నీ దగ్గిర నౌకరీ పనికి కుదిరాను. కాని, నా తండ్రి నా కోసం వెదికిస్తూనే వున్నాడు. అయన పంపిన చారులు నన్ను గుర్తించి, నేను కనబడనందుకు, నా తండ్రి ఎంత బాధ పడుతున్నాడో చెప్పారు. నేను, నీతో చెప్పకుండా, యీ నా దేశం తిరిగి వచ్చాను," అన్నాడు.

సుల్తాన్ ముబారక్‌కు కలిగిన సంతోషం అంతా యింతా కాదు. యువరాజు అతణ్ణి తండ్రి దగ్గిరకు తీసుకుపోయాడు. అయన ముబారక్‌కు రాజోచితమైన మర్యాదలు చేసి, విలువైన కానుకలిచ్చి, తగు రక్షణలో ఓడమీద సానానగరానికి పంపాడు.



# దిగులుకు కారణం

పేదవాడైనా ఎంతో ఉత్సాహంగా, ఆనందంగా నవ్వుతూ వుండే రంగయ్య, ఈ మధ్య కొన్నాళ్ళుగా ముఖం ముడుచుకుని, దిగులుగా వుండడం ప్రారంభించాడు.

రంగయ్యలో యింత పెద్ద మార్పు ఎందుకు వచ్చిందో తెలుసుకుందామని, అతడి మిత్రుడు సుబ్బయ్య, ఒకనాడు, "ఎన్నడూ లేంది, యింతగా మారిపోయావేం?" అని అడిగాడు.

రంగయ్య ఒకసారి పెద్దగా నిట్టూర్చి, "నీకు చెబుదామనుకుంటూనే మరిచాను, సుబ్బయ్యా! ఇంతకాలంగా లేనివాణ్ణే గదా, అయినా ఏ దిగులూ లేదు. ఆ మధ్య మా పెద మామయ్య పోయాడు; రెండు లక్షల ఆస్తి వచ్చి కలిసింది. ఆయనకు పిల్లాజెల్లా లేరు. పది రోజుల క్రితం, పొరుగు గ్రామంలో ముసలావిడ మా మేనత్త పోయింది. ఆవిడ భర్త ఏనాడో పోయాడు; పిల్లాజెల్లా లేరు. ఒక లక్షవరకూ ఆస్తి నాకు దక్కింది," అన్నాడు.

ఆ జవాబుకు సుబ్బయ్య ఆశ్చర్యపోతూ, "మరి యిలా ఆస్తి కలిస్తే సంతోషపడాలి గాని, దిగులుపడతావెందుకు?" అని అడిగాడు.

ఈసారి రంగయ్య చిన్నగా మూలిగి, "ఇక మా బంధుగణంలో పిల్లాజెల్లా లేనివాళ్ళు, ఎవళ్ళూ లేరు!" అన్నాడు.

—ఎం. డి. సౌజన్య



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1984 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.



S. G. Seshagiry



Mohan Kumar Sharma

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఏప్రిల్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: తబలా వాయించనా, అన్నా? రెండవ ఫోటో: అబ్బ, తలనెప్పిరా, చిన్నా!

పంపినవారు: యం. ప్రభాకర్, రామ్‌నగర్, హైద్రాబాదు-48.

*బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.*

### మీకు తెలుసా? సమాధానాలు

1. ఫ్రాన్స్‌కు చెందిన రేనె ఫ్రాంకాయిస్ ఆర్మాండ్ సల్లీ ప్రుదోమ్. 2. ఫ్రాన్స్ దేశానికి చెందిన జె. హెన్రీ డ్యూనాంట్. 3. జర్మనీ దేశస్థుడైన విల్‌హెల్మ్ కోన్రాడ్ రోన్ట్‌జెన్. 4. హాలెండ్‌కు చెందిన జాకోబస్ హెన్రికస్ వాంట్‌హాఫ్. 5. జర్మనీకి చెందిన ఎమిల్ వాన్ బెహ్రింగ్.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

**Results of Chandamama Camlin Colouring Contest No.34. (Telegu)**

*1st Prize:* D. Sucharitha, Adoni. *2nd Prize:* P.N.G. Suresh Kumar, Koraput-765 017. K. Malleswarappa, Panyampo. K. Sambasiva Prasad, Prakasam. *3rd Prize:* P. Anand, Visakhapatnam-530 016. L. Gouri Sankar, Rayagada. P. Sreenath, Adoni. B. Vidyadhara, Hyderabad-500 016. B. Sunitha, Warangal-506 134. P. Subhirkar Babu, Rayagada. M. Sneha Latha Madras-1. V. Subbarao, Gannavaram-521 101. T.S.V. Ramesh, Hyderabad-500 001. P.V. Vijaya Prasad, Hyderabad-500 855.

CHANDAMAMA

చందమామ



# చందమామ

మన ప్రాచీన సంస్కృతిని ప్రతిబింబించే

## సంస్కృత

భాషలో వెలువడుతున్నది.

ప్రారంభ సంచిక త్వరలోనే మీకు లభిస్తుంది. సరళమైన, చదవడానికి సులభమైన చక్కటి శైలిలో వెలువడే చందమామ కథలు— మన ప్రాచీన సంస్కృత భాషాభిమానులను తప్పక అలరిస్తాయి.

విడి ప్రతి : 2-00    సంవత్సర చందా : 24-00

తొలి సంచిక కోసం మీ న్యూస్ ఏజెంటుతో చెప్పి ఉంచండి. లేదా ఈ చిరునామాకు మని ఆర్డర్ పంపండి :

డాల్టన్ ఏజెన్సీస్
చందమామ బిల్డింగ్స్
188, ఆర్కాట్ రోడ్
వడపళని, మద్రాసు-600026



# మాల్టోవా ముఠా–
# వాళ్ళు ఎప్పుడేం చేస్తారో తెలియదింక !

మాల్టోవా తాగే పిల్లలంటే యిక చెప్పాలా! జీవితంలో ఆనందాన్ని సంపూర్తిగా, అందుకుంటారు—స్కూల్లోనేం, ఆటల్లోనేం. మంచితనం నిండుగా ఉన్న మాల్టోవా పిల్లలకెంతో హితకరమైనదేకాక, పాలను మంచి రుచికరమైన పానీయంలా మార్చివేస్తుంది కూడా!

**ప్రకృతి ఒడిలో పండిన గోధుమలు బార్లీల మాల్టు**

పంజాబులో పండిన గోధుమలు, బార్లీ, మాల్టోవా ప్లాంటులో పుష్టికరమైన మాల్టుగా మారిపోతాయి. ముఖ్యమైన ఖనిజాలు, విటమిన్-B తోటి మాల్టోవా సత్వరం శరీరంలో ఇమిడిపోయే జీర్ణీకృతాహారం.




**శుద్ధమైన, హితకరమైన పాలు**

మా స్వంత పాల సేకరణ కేంద్రాలద్వారా వస్తాయి, మాల్టోవాలో చేరే పాలు. ఇవి సదా నూటికి నూరుపాళ్లు శుద్ధమైనవి, నూరుపాళ్లు పుష్టికరమైనవి.

**నోరూరించే కోకో రుచి**

మేలైన విదేశీ కోకోనే మేము వాడుతాము. లేకపోతే మరి మీకు మంచి రుచి, మంచి పుష్టి ఎలా దొరుకుతాయి? కోకోతో కొత్త జీవం వస్తుంది. సేద తీరి విశ్రాంతికి దోహదమవుతుంది.

**శక్తికోసం చక్కెర**

ఏరి కోరి ఎన్నుకున్న శుద్ధమైన, తెల్లటి పంచదార. పిల్లలకవసరమైన ఆ అదనపు శక్తికోసం అతి ముఖ్యమైనది.

**విటమిన్లతో ప్రత్యేకించి పటిష్టం చేయబడింది**

ప్రోటీన్లు, కార్బోహైడ్రేట్లు, విటమిన్లు, ఖనిజాల అద్వితీయ సమ్మేళనం మాల్టోవా. ఇది అదనపు విటమిన్-A, నియాసిన్, విటమిన్-B1 విటమిన్-D2 లతో కూడా పటిష్టం చేయబడింది. కృత్రిమ సువాసనలిందులో లేవు.






**JIL** జగత్‌జీత్ ఇండస్ట్రీస్ లిమిటెడ్

1981, 1982లో మాండే (ప్రపంచ) ఎంపికలో బంగారు పతకాల విజేతలు

## విటమిన్‌లతో నిండిన మాల్టోవా: ఆరోగ్యం, బలం మరియు శక్తికోసం

SIMOES/JIL/1/83 TL